# అరేబియన్ నైట్సు

చక్కనికథల సంపుటము. చక్కనిపటములు అతిచమత్కారముగా, ఆశ్చర్యముగా, నీతిబోధకముగా, ఆనందముగా యుండును. కొలదిప్రతులు మాత్రమే అచ్చువేయించియున్నాము. క్యాలికో బైండు.

మొదటిభాగము 1—8—0

రెండవభాగము 1—8—0



—:o:—

# కన్యాశుల్కము

గ్రంథకర్త:—శ్రీగురుజాడ అప్పారావు పంతులుగారు బి. ఎ.

ఆంధ్రభాషలో చక్కనిహాస్యరసప్రధాన మగునాటకము. దీనిని గురించి తెలియనివారును కొనియాడనివారును నుండరు.

ఆంధ్రభాషలో నిట్టిగ్రంథము వేరొకటి లేదని చెప్పవచ్చును. కొలది ప్రతులు మాత్రమే యున్నవి. ఇందలి గిరీశముయొక్క మాటలు చర్యలు చదివి చూడవలసినదే గాని ఇచ్చుటవ్రాయతరముకాదు.

వెల రు. 1—0—0

—:o:—

# పండుగకట్నము.

కృతికర్త:

భోగరాజు నారాయణమూర్తిగారు

విజయనగర సంస్థానాస్థానకవి.



గాంధీశ్వరి బుక్కుడిపో

పాలకొండ

విశాఖపట్నంజిల్లా.

 [వెల 1—0—0

1927

రెండవకూర్పు
1000 ప్రతులు.

## సరస్వతీస్తవము.

అహరహమస్మదీయహృదయాంచిత కాంచనపీఠిపై శుభా
వహమగు త్వన్నిజాకృతిని భద్రముగా నెలకొల్పి, భక్తిమై
బహుగతుల న్నుతింతు నెడఁబాయక సద్గరుణించి, భారతీ
తుహినకరాననా ! యెటులఁదోడ్పడెదో నవకావ్యకల్పనన్.

శ్రీసీతారామాంజనేయ ప్రెస్
రాజమండ్రి.

పండుగ కట్నము

శ్రీగలయత్తవారు తొలిఁ జెప్పినరీతిని గట్నమీయమిన్
జేగురుమోముతో నలిగి చివ్వన నేగెను క్రొత్తయల్లుఁడో
నాగనిజారుణప్రభలసంతతముగా దిశలన్ వెలుంగఁ దా
నేగ దివాకరుండు జగమెల్లఁ దమూబున దుస్తమయ్యెగాన్

శా. శ్రీకృష్ణుండువరింపఁజేసితిని నాచెల్లిన్ వివాహంబునన్
లోకుల్ మూఢమునోపఁగానిఁకనీలో నెట్టి సంబంధముల్
చేకూర్పంగలరోకుమారులకువీక్షింతుంగదాయంచు, నా
రాకాచంద్రుఁడు మింటనిల్చెఁగడుగర్వస్ఫూర్తి దీపింపఁగాన్

ఉ. కానుకగొన్నయల్లుని మొగమ్ముగతిన్ గలువల్ హసింప; నే
కానుకలేనియల్లుని మొగమ్ముగతిన్ ముకుళించెఁ బద్మముల్
జాఁదినైజ మొక్కనిలయమ్మునఁ బుట్టి సమానధర్మముల్
పూనియు నిట్లగౌరవమునొందును సాధువు పాటివారిలోన్.

క. ధనికుల చుట్టరికము ని
ర్ధనికునకుఁ బరాభవప్రదమ్మని చంద్రిన్
గనిసంతనె యుడుగణములు
ఘనమాత్రములోనఁ దొలఁగి చనె నెచ్చటికో ||

ఉ॥ ఇచ్చెదరున్నవార లటులీయఁగఁజాలరు లేనివారలే
మిచ్చుటకేనియున్ దగియు నీయరు లోభులటంచు నెల్లెడన్
చొచ్చి, వివాహలగ్నములఁ జూచుచు సన్నిసయల్లుసల్క న
య్యచ్చపుమందగంధవహుడంతయుఁ బొసనుదా నెమాయమై॥

మ॥ సరసీజారిచకోర దంపతులకుత్సాహమ్ముఁ గల్గించి దు
శ్చరుఁడై పాపము చక్రదంపతులకున్ సంతాపముం గూర్చె; నొ
క్కరికిన్ మోదము ఖేదమింకొకరికిన్ గల్గన్ బ్రయత్నించుటల్
సిరితోఁ బుట్టినవానినైజగుణముల్ సిద్ధాంతమెందేనియున్

మ. వరుసన్ మేల్ కరదీపికాశతములన్ భాసిల్లు పెండ్లిండ్ల పం
దిరులన్ వెన్నెలఁ జొన్పి చంద్రుఁడు మరెంతే శోభగల్గించె; ని
ష్ఠురుణాన్ బేదకుమాని ద్రవ్యయుతునిన్ గట్నాల మన్నించుటల్
సిరితోఁ బుట్టినవాని నైజగుణముల్ సిద్ధాంతమెందేనియున్

మ. మరియుం బెక్కగతుల్ ప్రమోదమును నాత్మంగొల్పు
[నారాతిరిన్

బరహాంపూరున నొక్కయింటనొకడా బాపైనిగూర్చుండి సుం
దరియా భార్యయు లోభియా పతియును ద్వాహ ప్రసంగమ్మునన్
వరుసన్ వాదములాడఁ జొచ్చిరి యభిప్రాయంబు భేదించుటన్

ఉ. క్రిందటి మాఘమాసమున కేమ సీతకుఁ బెండ్లియాడు ద
ప్పెందలవంపుగల్గునది పెద్దదియానెడ; దానియీడు వా
రెందరొ కాపురంబునకు నేగుట చూచితి, మీరు నేనునున్॥

నొందరచెందనున్న యెడ నూయుగొ గోఁగుగొయిచూచు
గ్రీవలెన్.

చ. కడచినకార్తికంబున కేగా పదమూడవయేఁడు వచ్చె నీ
గడియకుఁ బెండ్లిమాటకలగానయినన్ స్మరియింపరైరి; మీ
గడుసుఁదనంబు పోల్చుకొనఁగాఁదగుజాణనుగానుగాని యీ
బుడుతనుగూర్చి యేమితలపోసిరొ చెప్పుఁడు! ప్రాణనాయకా!

ఉ. పక్కన నవ్విపోయిరఁట బంధువులందరుఁ బెండ్లియందు సు
బ్బక్కకుమాగ్రపందివలెఁ బల్లకినెక్కుచునుండ; నందరున్
ముక్కున వ్రేలు పెట్టుకొని మొట్టలు మొట్టరె? మీరు నేనునున్
లోకువయౌదుమిట్లయిన లోకులు కాకులు మీరెఱుంగరే?॥

చ. మఱియొకసంగతిన్ వినుఁడు! మాపదమామయగారి చిన్న కూ
తురుగతి యేమియైనది? యెదుగ్గను వేళకుఁ దోటలోన నం
దఱుఁగని పెండ్లికూతురు విధమ్ము రజస్వల యట్టులున్న నం
చరిగిరికాదె భోజనముగా ననుజేయక తప్పదమ్మనన్.

సీ. మధుపర్కమునుగట్టి మగనిచాటున నెట్టి
నక్కుచుఁ బల్లకి నెక్కునపుడు
తలుపులకడ ముద్దుగొలుక నచ్చియు రాని
పలుకులఁ బలిసేరు పలుకునపుడు
చుట్టుమూగినయట్టి చుట్టాలు ముచ్చటన్
గనుచుండ మగఁడెత్తుకొనిన యపుడు
పతిచెంతఁగూర్చుండి సతులు పాటలుపాడ
నతనితోఁ బూబంతులాడు నపుడు

ఏడేనిమిదేండ్ల బిడ్డయానేని మిగుల
శోభగానుండునే కాని చూచుటకును;
కట్టుతప్పి పెండిలియాడుగడచి గేదె
పడ్డవలెనున్న బిడ్డ శోభస్కరంబె?"

ఉ. ఇన్నిటికేమి నాకు నయిదేడులు వచ్చెనో లేదొకాని మా
నాన్నవివాహయత్నములొనర్చుచుఁ బెండిలియాడదప్పెనా
చిన్నకుమార్తెకంచుఁ గడుఁ జింతిలుచుండుట నాకుజ్ఞాపకం
బున్నది; ముద్దుముచ్చటయునుండునెయంతకునీడుమించినన్

ఉ. జ్ఞానమువచ్చి సీతచెలికత్తియలందరుఁ బెండ్లియాడఁగాఁ
దానటులుండిపోవుటకెదర్గ కృశియించుచునెన్నిమార్లొ నా
తోననెఁ నాన్నగారికేఁకఁ దోచకపోయిన నీవెచెప్ప వ
మ్మా! ననుఁగూర్చి' యంచు; నవ్వునట్లనినందునదోషమున్నదే

ఉ. అక్కట! పెండ్లిలేదనెడునట్టి విచారముచేతనే కడుర్
జిక్కియొకప్పుడున్ గడుపునిండభుజింపక నిద్రపోక యీ
ఫక్కిని లేనిజబ్బు బలవంతముగాఁగొనితెచ్చుకొన్న దీ
చిక్కుతొలంగిపెండ్లియయి సేమముగాంచుటయెన్నఁడో కదా!

ఉ. మంచముపట్టియున్న దొకమాసమునుండియునౌషధంబులి
ప్పించితిమెన్నియో గుణమువీసముగల్గదు, డబ్బుగూర్చి ల
క్షించక రెండువారముల క్రిందటనే దొరసానినుంచి నా
మెంచి రవంతయైన గుణమీయకయున్న దదేమిపాపమో.

గీ. చిన్న సీతమ్మ! నిన్న మీనాన్నగారు
నీకు మంచిసంబంధము నిశ్చయించి

నారనుచు దాని సంతుష్టిఁ గోరి నేను
సీతతోనంటి నేనూనా మాతమనుచు.

ఉ. కాటుకకన్నులన్ వెడలి కాలువకట్టెను నీటిబొట్టులన్
బైటచెరంగుతోఁ దుడిచి ప్రక్కకు మోమిడి వెక్కి వెక్కి నా
మాటకదేమి కారణము మారువచింపక యేడ్వఁజొచ్చె; నా
నాటికి సీతసంగతి యనంబడుచున్నది క్రొత్తవైఖరిన్.

శా. 'ఏఁడీ? ఎక్కడ? రామచంద్రుఁడిఁక రానేరాడ! రేపైనవ
స్తాడా?' యంచును బల్వరించుచుఁట యూష్ణంబందునిన్న మా
టాడంగా దొరసాని చెప్పినది; యేమైనన్ రహస్యంబు మీ
తోడన్ జెప్పద మీరు నమ్మదగ లేదో కాని నామాటలన్

గీ. నిరుడు వేసంగిలో రెండు నెలల సెలవు
గడపె మనయింట రామచంద్రుఁ డదిమొదలు
వాస్తవమ్ముగ మనసీత వ్యసనంబు
నాకుఁ గ్రొత్తగాఁ దోచుచున్నది యదేమొ ?

క. సంగతులను సందర్భము
లం గనుఁగొన సీతమనసు లగ్నంబై యుం
డంగా వలె నాతనియం
దుం గావున నేమి సేయుదునొ మీరింకన్.

గీ. ఏడనిమిదేండ్లు రాకమున్నె వివాహ
మాడు బిడ్డను గావలె ననుచుఁ బెద్ద
లూరకే ఘోషపెట్టిరే? కారణమ్ము
బోధపడెనదికద సీత బాధవలన.

క. పదమూఁడేఁడుల చిన్నది
చదువులు చదివినది మిగులఁ జక్కనిదై కో
రదె స్వయముగ వరునీగతి ?
అదిమీఁతప్పగును దాని దనరెవ్వారుల్?

గీ. రామచంద్రుఁడు తనకు భారతమునిచ్చి
చదువుకొనుమనెనఁట ! యది మొదలుగాఁగ
బావగారిచ్చిరని యదేపనిగఁ జూపు
చుండు నందరి కుప్పొంగుచుండు నెపుడు.

గీ. ఏమి గ్రహచారమోకాని రామచంద్రుఁ
డన్న సీతకు దైవమైయున్నవాఁడు
దానిదురదృష్టమో ? లేక దానిపేరు
బలమొ ? యేమికానున్నదో తెలియదకట.

ఆ. వె. నాటినుండియిట్లు నలువురినోళ్ళలోఁ
గంట్రికంబు పడినకారణమునఁ
బనసపండువంటి బాలికారత్నము
చిక్కిశల్యమయ్యె నక్కటకట !

శా. చాదస్తంబిఁకమాని ప్రొద్దున నెపంచాంగంబుచూపించిమీ
రేదేనా సుముహూర్తనిశ్చయము చేయించండి? మేనల్లు
నేదెల్లైన నదల్లైయాను ముడివేయించండి సీతమ్మకుల్
మీఁదన్ దైవమెయున్నవాఁడుమనమేమీఁచేయలేమేకదా

ఉ. తోటలుదొడ్లు భూమివసతుల్ మొదలైనవిలేకయున్న నా
పూటకులేనివాఁడయిన బొట్టు నొసంగక తప్పదింక; నా

మాటవినండి! దీనికణుమాత్రము నష్టముచెప్పకండి? యీ
పాటికినైన సీతకు శుభంబనుమాట యనండి నోటితోన్.

గీ. నా వివాహంబునందు మానాన్నగారు
నాల్గుగరిసెలమడిచెక్క నాకొసగిరి
సీతకరణమ్ముగానిచ్చినైతుదాని
భావసతిలేనిలోపమ్ము పుట్టదింక॥

గీ. ముక్కు మొగమునెఱుంగని దిక్కుమాలి
నట్టి పెద్దసంబంధాల కాశపడక
చెప్ప చేతలనున్నాడు సీతనింక
రామచంద్రున కొసంగుడీ రవ్వయేల?॥

క. బియ్యేలంట ! యెమ్మేలంట!
వెయ్యిన్నాట పదియాగ్లు విసుగూసనఁగే
పొయ్యాలంట! బైస్కిళ్లను
నియ్యాలంట! యల్కనాఁడి వెక్కడిఘూసల్?

క. తప్పనిసరియని యన్నిటి
కొప్పుకొనుచుఁ గడకుఁ బెండ్లి యొనరించినచోఁ
జిప్పయు దొప్పయుఁ జేతికిఁ
దప్పకవచ్చును సుమండి తలిదండ్రులకున్॥

ఉ. పెద్దపరీక్షప్యాసయిన పిల్లఁడటంచును సీమకోసమేల్
ముద్దుగ నున్నదంచుఁ దనముద్దులబిడ్డను దబ్బునిచ్చియున్

గుడ్డులుదిన్నయట్లు తరిగొప్పుల వేంకటరావుకిచ్చి యే
పొద్దును భీమశంకరముపొందు విచారము చెప్పవచ్చునే?

ఉ. పెండిలియాడికట్నముగఁ బెట్టినదంతయు మూటగట్టి, యు
ల్లుండలయత్తమామయు నలో మనియేడ్వ నదేపరీక్షకో
లండనుబోయి నేటికిని రాఁడుగదా పదియేడ్లనుండి; యే
ముండనొకూడివాఁడుచెడిపోయెనటంచనుచుందురందఱుర్॥

సీ॥ పుట్టెను వగపుతోఁ బట్టెడన్నమునైన
ముట్టక తనుదానె తిట్టుకొనుచు
ధూర్తుఁడై చనినట్టి భర్తపై జనియించు
దుర్వార్తలాలించి దుఃఖ పడుచు
తనయీడు చెలుల నూతన కాపురమ్ములు
గని వేడినిట్టూర్పు గార్చుకొనుచు
నాకు దిక్కెవరున్నారింక నయ్యోనా
పాపమంచును గుండెబాదుకొనుచు
పెద్దదైనట్టి మైదేండ్ల పొద్దునుండి
మగని మొగమెట్టిదో తాను మరచిపోయి
కడవల కొలంది నేడ్చు శంకరవుగారి
కన్నకూతురి దురవస్థకాంచినారె?

సీ॥ మేస్తర్ల చేజాల మెప్పించుకొన్నాఁడు
మంచివాఁడను పేరుకాంచినాఁడు

పోకిరీవేషాలఁబో పూర్జితంబున్న
వాఁడు పాపము నుండగేఁడు కాఁడు
చురుకైనవాఁడు ముందరికిరాఁగలవాఁడు
మంచిచేష్టలెరింగి మసలువాఁడు
మనసీత మనసుకెక్కినవాఁడు మంచిచ
క్కనివాఁడు మీరెదిక్కనినవాఁడు
చిన తనంబునుండి మనయింటనున్నాఁడు
తల్లితండ్రిలేని పిల్లవాఁడు
పెంచిపెద్దఁజేసి పిల్లనిచ్చుటకన్న
పారమార్థికంబు వేరుగలదె?

ఉ. కాఁగలవాఁడువిద్యయునుగౌరవముంగలవాఁడువాఁడు, మీ
రేగతి, పారమార్థికము నెంచి కుమారితనొసంగి గేని మే
లౌఁగద? యింతయాస్తియును సక్కట! నస్తిని బెట్టుకొం
|చు నా
రేగుదుమే! కుమారుఁడొకఁడేనియు లేనిదుఃఖంబుచింతనోక్క.

ఉ. కాలువప్రక్కభూములు, నెగాదిగఁబండెడు పచ్చపచ్చ సే
రీలును, గుత్తచేసిన ఖరీదగు తోటలు, సప్పలిచ్చిన
ట్టీలకువడ్డికట్టుచు గడించిన మూటలు గ్రుమ్మరించినన్
వేలకు వేలుగా నిలువవేసితి రార్చుతునాటుబ్యాంకులో !

క. కోమలకైనఁ గూతుఁగన్నను
గడకదియే కాన మనసుగలవానికి మీ

బిడనోడఁగూరిచి వడి మీ
గడియించిన దొనగిరేని గల విహాపరముల్.

క॥ దత్తతగూరిచి లేశము
చిత్తమునఁ దలంపఁబోక, శీఘ్రమపను లా
యత్తపరచి మేనల్లున
కుత్తరమును వ్రాసిపంపుఁ డుత్సాహముతోన్.

గీ॥ అనియనేకవిధమ్ముల నాత్మజాత
పరిణయముఁగూర్చి యిల్లాలు పలికినట్టి
పలుకులన్నియు నాలించి యులికిపడి మ
హాగ్రహావేశ పరవశుండగుచు నపుడు.

సీ. శిరమునగోష్పాద పరిమితిగలపండు
వెండ్రుకల్ ముడివీడి వెన్నువంట
నొసటి గంధంపుఁబూత నెసగుకుంకుమబొట్టు
చిఱుచెమ్మటలఁ గ్రిమ్మికరగిచెదర
మెడలోనఁ జీరాడు మెరుగుబంగరుకట్ల
తులసిపూసలమాల దుసికిలంగ
పొడిదగ్గుచే బుగ్గనిడినట్టి కలకండ
సారమ్ము బొజ్జపైఁ గారుచుండ
ముడుతముడుతలు పడినట్టి యొడలువడఁక
పట్టుతప్పి దౌడలువ్రేలబడఁ జికాకు

చూపుచూపులఁ జూచుచుఁ జూచిచూచి
భార్యకిట్లనిపల్కె నా బ్రాహ్మణుండు.

ఆ॥ వె॥ ‘‘ఔనె! మాటకారివగుదువె కాని, నీ
పాటితెలివిలేని వాఁడఁగాను
మాయమింకనోరు! నీదుపన్యాసంబు
వింటిఁ జాలునింక వినుగు పుట్టు.

ఆ॥ వె॥ స్టేజిపైని నిల్చి చెప్పించినట్లునఁ
గడఁగి లెక్చరీయఁగలవు నీవు
మాటనేర్పులేని మందబుద్ధిని సమా
ధానమేమి చెప్పలేను నేను.

ఆ॥ వె॥ మంచిచెడ్డలను గ్రహించక యిట్లెవ్వఁ
డాడుగాని కథికప్రేమ చనువు
నిచ్చి నెత్తిపైని నెక్కించుకొనువాని
బ్రతుకు నట్టి రవ్వపాలుగాదె ?

సీ. గోరంత జబ్బున్నఁ గొండంతగాఁజేయు
గయ్యాళి వగలఁకు గలతచెందు
ఆలిమాటల నమ్మి యానుగాదనకుండ
ముసలి తల్లినిగాంచి కసరుచుండు
తోడఁబుట్టుటలైన దూరమ్ముగానుంచి
కులకాంత సెలవుపై మెలఁగుచుండు
వెలది పల్కినపలుకు వేదవాక్కనియెంచు

సుదతియే మోక్షమంచును దలంచు
తరుణి పాదములకు దాసుఁడై దాస్యంబు
సేయువానిస్థితులు వేయిగతులు
మగువ! యట్టి పనికిమాలిన పెద్దమ్మ
మాలిచేతిలోని కీలుబొమ్మ॥

ఉ. పాయని రోగమందుఁ బసిబాలదగుల్కొనె, దీననేమహా
పాయమొ? యేమిదారి? భగవంతుడ! యంచుననేడ్చుచుండ "నా
క్నో"యనిప్రాణముల్ కొఱుకుచుందువు నీమతిపోయెనేమొ? నీ
కీ యవివేక మెప్పటికి నిట్టులెయున్నదదేమి పాపమో?

ఉ. బోలెడు డబ్బుపెట్టి కొనిపోసిన మందులు వ్యర్థమయ్యె, నే
వేళకునెట్టిసంగతి చెవింబడునోయని యిట్లు కంటికిన్
నేలకునేడ్చుచుంటి నిదినీవుగ్రహింపక మూర్ఖచిత్తవై
ప్రేలుచునున్నదాన వవివేకునికిందవ సనుంగణించుచున్

సీ॥ రామచంద్రునిగాంచి ప్రేమించి మనచిన్న
ముద్దు సీతమ్మ యెప్పుడువరించె
తనకు వానికిఁబెండ్లి యొనరింపుమని సిగ్గొ
కింతైనలేక నిన్నెప్పుడడిగె
జ్వరతీవ్రమున రామచంద్రా! యటంచు నా
పసికూనయెప్పుడు పల్వరించె
ఆమాటలాలించి యవివేకురాలైన
వారసాని యెవుడు నీతోడఁజెప్పె

కన్నువీడని యాసనికందుపైని
నెంతవరకు గల్పించినావే గయాళి !
విన్నవారు సన్వేదరక్ వివేకమొందు
వలనఁ గలుగదొ నీకు నిర్భాగ్యురాల!.

గీ. మోహమున భర్తయన్న నేమో యెఱుఁగని
చంటికూన కోరునె రామచంద్రునట్లు ?
సీతసతనికిఁ గూర్పంగ నీతలంపు
గాని సాగని కోర్కెలు మానుమింక.

గీ॥ కంచుకాగడాలెత్తి ప్రపంచమెల్ల
నెంతవెదకిన నొకబత్తెడేని భూమి
వసతిలేని దరిద్రుని పాలుచేసి
కూతుమెడ తెగనికత్తిని గోయఁగలను॥

గీ॥ విద్యగలవాఁడెయగును; వివేకవంతుఁ
డేయథార్థము; రూపసియే నిజమ్ము;
కాని భూమివసతిలేని కారణమున
నన్నియును సంకెలేసట్టి సున్నలయ్యె॥

గీ॥ వెండిచెంబులు నుంగరాల్ విలువగలుగు
మేటి బంగారు మొలత్రాళ్ళ మాటకేమి ?
పట్టుసంచల చాపైనఁ గట్టుకొనుట
కర్హుఁడై యుండవలదె నీయల్లుఁడకట॥

గీ॥ తల్లిదండ్రులు లేనట్టి పిల్లఁడనుచుఁ
బెంచి పెద్దవానినిజేసి ప్రేమతోడఁ
జదువు చెప్పించుచున్నాము చాలునింత
కన్నఁ జేయఁదగినదేమి కలదో చెపుమ॥

గీ॥ నీవు నీమఁడిచెక్క వానికి నొసంగి
నంతమాత్రాన ధనవంతుఁ డగునె వాఁడు?
కాని యమ్మాయి పెండ్లిసంగతినిగూర్చి
నా మనోనిశ్చయమ్ము సాంతముగవినుము॥

మ॥ అయిదారేండ్లనుండి పట్టుదలతో యత్నించుచున్నాడ నెం
దయినన్ జక్కని యీడుజోడుగలవాఁ డమ్మాయికై కానరా
డయినన్ గోరినకట్నమిచ్చునెడ నాయాసం బొకింతైన లే
కయెచేకూరఁగనున్న వెన్నొకటియుక్తంబైన సంబంధముల్

సీ॥ వలసినంతటిభూమి వసతిగల్గినచోట
సాంప్రదాయముఁగూర్చి శంకపుట్టు
సాంప్రదాయముగూడ సరియైనదగుచోటఁ
గటకటా గోత్రమ్ము కలియుచుండు
గోత్రంబు మనకనుకూలమౌచోటను
లేశమైనను విద్య లేకయుండు
విద్యాదిసుగుణముల్ వెలయఁగల్గినచోట
నంగవైకల్యంబె సంగుచుండు.

అంగవై కళ్యమును లేకయమిత రూప
వంతుఁడగు నెడఁ గట్నాల బాధమెంచు;
సుతులనూర్వుర సెంష్లింప్లు సుసెన్నుగాని
యొక్కయూపు సెండిలి కష్టమక్కటకట! .

॥ వెండిపళ్ళెరమందు వేయినూటపదార్లు
గుమ్మరింపుమటంచుఁ గోరినారు
బంగారు మొలతాళ్ళు నుంగరాల్ మురుగులు
చేయింపుమనినాకుఁ జెప్పినారు
ఎమ్మె బియక్ ప్యాసయినదాక చదువు చె
ప్పించునాయని యడిగించినారు
పగమునాస్తిని లగ్నసమయాన వ్రాసియి
చ్చెదవాయటంచుఁ బ్రశ్నించినారు
గొంతుముడిపెక వారట్లు కోరుచుండ
గుండియలునాకు బ్రద్దలౌచుండె నకట!
ఎంతయత్నించినానో! ముందేమిచేయఁ
గలనొ తెలియక పిరిలినఁ గార్యమేమి? ॥

| కలిమియును విద్యయును గంపుగలిగి కట్న
మడుగనట్టి సంబంధమొంటైననఁగలసి
వచ్చునేమోయనుచు నింతవరకుఁ జాల
యత్నమొనరించితినిగాని వ్యర్థమయ్యె॥

గీ॥ ఇందుచేతనె యమ్మాయి కింతవరకుఁ
బెండ్లికార్యంబు నేను గావింపలేదు
మంచిసంబంధమొకచోట నుంచినాను
అదియెనిశ్చయపరతు నెట్లయిన నింక.

క॥ పొన్నాడ కామరాజని
యున్నాఁడొక చిన్నివాఁడయోగ్యుఁడు కాఁడే
మున్నను నొక్కఁడె; తమ్ములు
నన్నలులే రాస్తియెల్ల నతనిదెసుమ్మీ॥

క॥ పదిగరిసెల రాబడిగల ;
దదిగాకై దారువేల కధికమునగదు
న్నదియఁట! లేశము ఋణము
న్నదిలేదఁట! కట్నమడుగఁడఁట కాసైనన్॥

క॥ నలువదియేండ్ల వయస్సని
పలికెదరేకాని, మూఁడుపదులకు దాటం
గల యీడున్నటు తోఁచును
కలిపించినమాట నమ్మఁగా రాదుకదా? ॥

ఆ. వె॥ అందకాఁడటంచు ననఁజాలనైనఁగు
రూపికాఁడు మంచియేపువాఁడు
నలుపు తెలుపు రెండుగలిగిన యొకఛాయ
గలుగువాఁడెకాని నలుపుగాఁడు॥

క॥ పదియేండ్లు గావచ్చెను
మొదటికళత్రమును నష్టపోయియు నాటిం
డిదివరకుఁ బెండ్లియాడఁడు
వదలని క్షయరోగమింతవర కుండుటచేన్॥

గీ॥ వేలువందలు వైద్యులపాలఁబోసి
కొనవరకుజబ్బు తొలగించుకొన్న వాఁడు
ఇంకసీతమ్మనిచ్చుట కెంతమాత్ర
మైన సంశయించుట నట్టియనవసరము॥

క॥ రోగంబంతయుఁబూర్తిగ
బాగైనదో లేదోయనుచుఁ బలువురితోడన్
"భోగట్టా" చేసితి నా
రోగంబిఁకఁ గుదిరెననుట రూఢియెనున్నాళ్ళ॥

గీ॥ మొదటిభార్యకుఁగల్గిన ముగ్వురాఁడు
కూనలును గూడఁబోయిరిగాన నింక
సవతిపిల్లలపోరు లేశమును సీత
కుండదేకద? హాయిగా నుండఁగలదు॥

గీ॥ తనకుసీతనిమ్మని నాకుఁదరుచువ్రాయు
చుండెనైనను గిట్టని వాండ్రుకొందరు
లాతఁడొకముండ నుంచుకొన్నట్లు నాకు
లేని సంశయమొకటి కల్పించినారు॥

గీ. ముండయును ముసుగులే దుత్తముండటంచుఁ
బలుకుబడిమీఁదఁ దరువాతఁ దెలిసె నాకు;
అయిన నింతకు మగవాఁడు ; ఆలిలేని
వాఁడు, డబ్బున్నవాఁడు; ఏయేమునైన
నేడ్చియుండును; ఆఘోష లేల మనకు ? ॥

గీ. ఇంతకీ కలికాలమం దెవ్వఁడట్టి
యేకపత్నీ వ్రతస్థుఁడో నాకుఁ జెపుము!
పెళ్లి కానంతసేపెన్ని వేషములును
వేయు; తరువాత నన్నియు మాయమగును॥

గీ. కులము గోత్రము రూపురేఖలును గలిమి
సాంప్రదాయము నన్నియుఁ జాలవరకు
నాకు సరిపడె; కానపొన్నాడవారి
చిన్నవానికె యిచ్చెద సీతనింక॥

క. కానంత కట్నమైనను
వీసము నాసింప ననుచు విస్పష్టముగా
వ్రాసె నిదివరకె; నేనును,
వ్రాసితి శుభలేఖ యిష్టపడినాననుచున్॥

గీ. వేయినూటపదారులు పోయకుండ
మంచిసంబంధమిట్లు ప్రాప్తించె మనకు
మనయదృష్టమొ? లేక యమ్మాయిచేసి
నట్టిపుణ్యమొ? యేమైన నగునుగాక! ॥

క. రాఁగలఫాల్గుణ మాసము
లోఁ గార్యము తప్ప ; దింతలో సీతయు నీ
రోగము కుదిరి శరీరము
బాగై యారోగ్యదశకు వచ్చునుగాదే! ॥

క. తనకు ద్వితీయవివాహం
బని, యాతండేకరాత్రియందే కార్యం
బును జేసికొందు ననుచును
ననెనఁట! నీయిష్టమెట్లొ యట్లె యొనర్తున్ ॥

ఆ. వె. ఏకరాత్రి పెండ్లియైనయెడఁ జాల
వరకు ఖర్చు తగ్గవచ్చు మనకు;
చూడవచ్చినట్టి చుట్టాలచే నిల్లు
గుల్లగాదు డబ్బు చెల్లిపోదు ॥

గీ. అయిన నీయిష్టమే సుమీ యనుచు సగోఁడు
పరమలౌక్యంబుగాఁ బల్కె భార్యతోడ;
ఖర్చుపెట్టని లోభుల గడుసుఁదనపు
మాటలాడువారు గ్రహించు పాటివారె? ॥

పండుగ కట్నము

దశరథరాజు సీతపరిణయమ్మునుగూర్చి
పలికినట్టి వెడగుపలుకులెల్ల
నాలకించి యాగ్రహాతిశయమ్మున
మేనఁ జెమటగ్రమ్మ జానకమ్మ॥

మ॥ కనులో భీత్వమునన్ గుమార్తెసుఖదుఃఖంబుల్ విచారింపకే
పెడదారింజను భర్తయత్నమును దప్పింపంగలే కేడ్వఁగా
తోడఁగెన్ భోరన; కార్యసాధనమునన్ దోడ్పాటు చునుండుంగదా?
కనుసూక్ష్మంబుగ నాడువారలకు గంగాదేవి ప్రత్యక్షమై.

క॥ అయ్యయ్యో యనుభార్యయుఁ
గుయ్యో మొఱ్ఱోయటంచుఁ గూతురు, గట్నం
బియ్యఁడని యేడ్చునల్లుఁడుఁ
జయ్యనఁగన్పింతురి లోభిసంసారమునన్.

క॥ అల్లుళ్ళునుఁ గూతుళ్ళును
నిల్లాలికి నాశ్రితులకు హితులకు నెప్పుడున్
జెల్లనికాసే నొసఁగక
ఘొల్లున నేడ్పించు లోభిగుణమున్ గనిరే.

సీ॥ ఆలిపై నొక్కింత జాలిపుట్టఁగనీదు
కన్నకూతురి సౌఖ్య మెన్ననీదు

అల్లునియల్క లక్ష్యముసేయనీయదు
గౌరవాగౌరవజ్ఞాన మీడదు
భోగంబులం దాశపుట్టఁగానీయదు
మంచిచెడ్డ లెఱింగి మసలనీదు
ఎంతకల్గిన నాశ నంతంబుకానీదు
చిత్తంబునకు శాంతిచేరనియదు
పరులుదూషింతురని భయంపడఁగనీదు
తను వశాశ్వతమనునీతి తలఁపనీదు
పారమార్థికచింతలఁ బడయనీదు
లోభి లోభిత్వ మేమందు లోకమందు.
పాపము ! శరభరాజు లోభ్యంబుచేత
భార్యకును గూతునకు ననివార్యమైన
హృదయసంతాప మొసఁగూడె; నిట్లె యెన్ని
హీనసంసారములు ప్రపంచానఁ గలవొ.
నాగవిల్లిదినంపు నానుదక్క మరొక్క
యరకాసునెఱుఁగదా పరమసాధ్వి
తనకొక్కదీరు జల్తారుచీరయు నెందుఁ
గట్టియెఱుంగదా ఘనచరిత్రి
నారగుట్టలుదక్క నాకునేమనునొక్క
పట్టుపోగెఱుఁగదా భాసురాంగి

పుట్టినింటనునోచి నట్టినోములుదక్క-
నొకనోమునెఱుఁగదా యురుగుణాఢ్య
వేలకునువేలుగలవాని యాలియయ్యు
పట్టినిర్భాగ్యుఁ జేపట్టి నట్టులామె
కలనయిన సౌఖ్యమన నెఱుంగక మెలంగు
నట్టి లోభీశ్వరుఁడు పతియైనకతన.

గీ. తనదు లోభిత్వమున కట్టె ధన్యచరిత
పరమసాధ్వి యిల్లాలౌటఁబట్టె కాని
యింకొకతెయైనయెడల గుట్టెల్లఁదొలఁగి
శరభరాజు సంసార మేచంద మగునో ?

మ॥ తనకుంగట్నము బాధలేదని యసందర్భంపు సంబంధ మి
ట్లనుఁగుంబిడ్డకునిశ్చయించెనని యయ్యబ్జాక్షి దుఃఖించి, చే
యునదిం కేమియులేక రోషమునసూయాయోగోయియోచూ
చుకొం
దునటంచుంగడునేడ్వఁజొచ్చెనతిఘూర్ణంభ గ్నవీక్షించుచుం

క॥ చిన్నప్పుడుఁ నాగ్రహమును
గన్నప్పుడుఁ దెలివిలేని కాంతలకెల్లం
దు న్నాతులు గోతులు నిజ
మెన్నంగా లక్కపిడతలే యగుఁగాదే ?

మ॥ అటుదుఃఖించి పతిప్రియత్న మనివార్యంబంచునూహించి
యిం
కెటుకానున్నదొ సీతభాగ్యమదియట్లే యానటంచెంచియిం

కటఁదానిల్వకనిద్రపై నెపముతో నాసాధ్విలేవంగఁ దాఁ
జిటికెల్ వేయుచు నావులించుచునులేచెఁ భర్తవెన్వెంటనే.

గీ. అటు పరస్పరాగ్రహ చిత్తులగుచు వార
లొండొరులతోడ మాటాడకుండ ముందు
జానకమ్మయు, వెనుకను శరభరాజు
నల్లనఁ మెట్లు దిగిక్రింది కరిగిరంత.

సీ. రంగారు బంగారు రంగొప్పు నునుగొప్పు
గప్పుకుళ్ళాయి చక్కఁగ ధరించి
లేదులేదనిపించు లేఁగౌనుజిగిమించు
గతిఁబొల్చు తెల్లని గౌనుదాల్చి
వదనమ్ము క్రొత్తచక్కఁదనమ్ము గనలోచ
నమ్ములందు సులోచనమ్ములుంచి
వాటమౌమేజోటి నీటు తేటునుగీటు
సూటైన మేల్బూటు జోడుదొడఁగి
గుండె పరికించురబ్బరు గొట్టమొండు
నడుమునఁదగిల్చి చావడినడుమనిల్చి
వైద్యురాలైన దొరసాని వారికప్పు
డెదురుపడె; సీతకై వారు బెదురుపడఁగ.

ఉ. కూతునకే ప్రమాదమొనగూడెనొయంచునుజానకమ్మయు
త్యాతురతఁ భయంపడుచు నచ్చటికేఁగఁగ నామెతోడనే

యాతఁడుఁగూడ మిక్కిలి భయాతురుఁడై చనిచెంతనిల్చిమా
సీతకు నెట్టులున్నదియొ చెప్పుమనన్ దొరసానియిట్లనున్.

క॥ పంతులు ! మీరెంతయు ధన
వంతులు, నదిగాక సుగుణవంతులువిద్యా
వంతులు,మీకన్నసుమా
యింతులు,పనిలోవలంతులే సాధింపన్ ?.

గీ॥ వయసు చాలఁగమీరిన వారు వలసి
నంత లోకానుభవమున్నయట్టి వారు
మీకు బుద్ధులు చెప్పుట నాకుఁ దగదు
కాని, చెప్పకతప్పదు గాన వినుఁడు॥

గీ॥ చనువుగల దందుచేత నేమనినఁగాని
నను క్షమింపంగవలయు; సీతనుగురించి
చెప్పుటకులేదు చూచుటతప్పు; మీకు
మార్తె చెంతకు రండొక్క మారు మీరు

క॥ అనిపలికి టక్కు టక్కునఁ
దనజోడొక వింతయైన ధ్వనిసేయఁగఁ జ
ప్పునఁ జావడిగదిలోనికిఁ
జనె నాదంపతులు వెంటఁ జనుదేరంగన్.

సీ॥ బుద్ధిదీపపుఁబోగన్ బూజుపట్టినపట్లు
వేళ్లఁగట్టిన చాందినీలుగాఁగ

కేశులూడిన తాటియాకుచాపలె నేలఁ
బరచిన రత్నకంబళులుగాఁగ
చెదపుర్వులల్లిన చెదలుగోడలకెల్ల
చిత్తరువులభాతి చెన్నుమీఱ
కుసులుజారిన నులకమంచంబులే
యటఁదూగుటుయ్యాల లగుచుఁదనర
గబ్బిలమ్ముల రెక్కలబ్బురంపడఁజేయు
వింజామరమ్ములై రంజిలంగ
నలుదెసలఁ గ్రమ్ముకొనిన దోమలగనమ్ము
సొగసుకత్తెల సంగీతముగఁ జెలంగ
వరలు నాగదియెల్ల నాశరభరాజ
రాజ శబ్దంబు మిగుల సార్థకమొనర్చె.
భృంగమ్ముల తెఱంగు ముంగురుల్ చెలరేగి
మొగమునెమ్మినిగ్రమ్మి నగముగప్ప
లోలోననె కృశించు నాలోలలోచన
లోచనమ్ములు చాలలోతువార
చక్కని చిక్కని చక్కటిస్తనమ్ములు
కన్నీటి బొప్పులై కాలువాఱ
జ్వరతీవ్రమునఁగ్రాఁగి సన్నగిల్లినమేని
పసుపుపచ్చనిచాయ పసలొలంగ

వండుగ

జీర్ణమై కడుమాసిన చీరనడఁగి
సహజలావణ్య గరిమమ్ము సన్యసింపఁ
బతిపతియటంచు విలపించు రతివిధానఁ
గన్పడుకుమార్తెనరసె నాకన్నతండ్రి.

సీ॥ కంటకావృతభీమ కాననాంతరసీమఁ
గొమరారు కేతకీ కుసుమమట్లు
కడుహైన్యమున భూమిగర్భానఁ బ్రచ్ఛన్న
గతినడంగిన మేటి గతనమట్లు
హిమజాల శైవాల సముదయమ్ములఁజిక్కి-
పంకనిర్మగ్నమా పద్మమట్లు
రాహుగ్రహాగ్రస్థ రాకాసుధాకరు
నిస్తేజచంద్రికానిచయమట్లు
మాసిభరియింపరాని దుర్వాసనగల
మాసికల బొంతపైఁ గుక్కిమంచమందు
లేశమును దనువుపై స్మృతిలేకపడిన
కన్నకూతురినరసె నాకన్నతండ్రి.

గీ. మివుల జ్వరతీవ్రముప మేనస్మృతితొలంగి
పలుగతులఁ బ్రియునిగూరిచి పలువరించు
బాలనొకవేళఁ జూపుచుఁ బలికెనిట్లు
శరభరాజుతో దొరసాని జాలిఁబూని.

శా॥ ఎల్లెమ్మెస్సుపరీక్ష ప్యాసయిన యీయేడేండ్లలోఁగాటికిన్
గాళ్ళుంజాపిన రోగులన్ సయితమున్ గాపాడితింగాని, నా
వల్లంబాయని రోగమొక్కటియుసంప్రాప్తింప; దాశ్చర్యమె
న్నాళ్ళోర్పైనను బాయకున్నయదియూష్ణంబీకుమారీమణిన్.

మ. ఇది టైఫాయిడు ఫీవరేయయినచో నిన్నాళ్ళుజీవింపనీ
యదు; నాయౌషధమింక నేజ్వరమునేనన్నాళ్ళురానీయ,ది
య్యదిచిత్రంబగువ్యాధివైద్యులకుసుంతైనన్ గ్రహింపంగరా
నిది, నేఁజోల్చితిఁ దెల్పెదన్ వినుఁడుదీనింగూర్చిస్పష్టమ్ముగా.

గీ. మీరుసమ్మరుగాని సాధారణముగ
డాక్టరులకిట్టి కేసు తటస్థపడదు;
అటు తటస్థపడినయెడ సరసి వ్యాధి
యిట్టిదని గ్రహించుట వట్టిమాట.

ఉ. వ్యాధులయందు నెందునిటువంటిది కల్గదు; దీనికిన్ మనో
వ్యాధియటంచుఁబేరు; తగినట్టుల నౌషధసేవలెన్నొ యే
వ్యాధులకేని దత్తదుచితానుగతిన్ గలవైన నీమనో
వ్యాధికిమందులేదనుచుఁబల్కెదరార్యులు బ్రాహ్మణోత్తమా.

గీ. ఏమహా వ్యాధియునుగూడ నింతఘోర
బాధ కల్గింప దీ మనోవ్యాధిరీతి
మృతునిమాత్రము మొదలంటఁ జితిదహించుఁ
గాని, యిది ప్రాణముంచియే కాల్చుచుండు.

సీ॥ నీరు సన్నమునిద్ర గోరనీయక పీల్చు,
దినదినమ్మును శుష్కతనువొనర్చు
లేనిసంకటము లెన్నేనిదాఁగల్పించు,
సహజధైర్యస్థైర్య సమితిగూల్చు
కడుపునఁ బెనుచిచ్చు వొడమించి బాధించు,
కలరూపురేఖల కళలడంచు
తెలివితేటలుడించు దీనత్వమునుగూర్చు;
పనిపాటులొనరించు మనసుమార్చు
క్రమముగా మంచమెక్కించు సమితగోఁగ
మందునర్ధముంచుఁ బ్రాణమ్ములపహరించు
వేనవేలుగ లోకానఁ గానిపించు
వ్యాధులందేది యీమనోవ్యాధిమించు?.
గీ॥ చెఱుకుగానుగునందునఁ జెఱుకువోలె
నీమనోవ్యాధికిం జిక్కి నీ నెలంత;
ఎముకలొసలించి రక్తమాంసములుపీల్చి
పిప్పిచేసినదీమె నీగొప్పవ్యాధి.
క॥ ఈ రమణి మనోవ్యాధికిఁ
గారణమును నే గ్రహించి కలసంగతులన్
మీ రమణికిఁ దెలిపితి; నా
పేరిణమున నీమె మీకెఱింగించెఁగదా?.

చ॥ ఎఱిఁగియు నింతకాలమిటు లేటికి జాలము చేసినారు? న
మ్మరో? మఱపొందినారొ? యనుమానము చెందిరో?
రామచంద్రు నీ
వరకును నేలరమ్మనరు? వానిముఖేందువిలోకనంబె యీ
తరుణికి నౌషధంబు; భయదంబగు జాడ్యతమోనివృత్తికిన్.

శా॥ అబ్బా లుంగను రెప్పలెత్తి యొకమారమ్మాయి వీక్షించినన్
మబ్బుం బాసినయట్టి పూర్ణశశిబింబంబున్ విడంబించుచున్
జబ్బుం గిబ్బును సర్వముం దొలఁగి సాక్షాల్లక్ష్మియై తోఁచు; న
బ్బబ్బా! బల్మి నిజంపి వేసెదవటయ్యా! యీకుమారీమణిన్

చ. ఎముకలు చర్మమున్ మిగిలి యొకించుకయైన సిగిదక్కరక్తమాం
సములిసుమంత లేకయె కృశస్థితినున్న కుమార్తెఁ గాంచి చి
త్తము నెటులాపఁ గల్గితిరొ? స్థైరము నెట్లు వహించినారొ? ధ
ర్మమె యిటువంటి పట్టుదలమానుఁడు కన్నకుమార్తె పట్టునన్.

శా. మేనల్లుండతి బుద్ధిమంతుఁడుగదా! మీరేల శంకింతురో
వానిన్ సీతకుఁ గూర్పమీకుఁ గల యైశ్వర్యంబదే నాటికీ
నైనన్ సీత దె కాన భూవసతి లేదంచున్ విసర్జించుటే
మైనన్ బాగుగనున్నదయ్య! కలదయ్యా! యిట్టిలెందేనియున్

చ. మునుపటియట్లు కన్పడదు ముద్దులసీత విధమ్ము చూడ, నే
క్షణమున నో రహాస్యముగఁ గన్నులు రెండును దేలవైచు; నిం

చినపిదపన్ విచారపడి చేయునదేమియులేదుకాన, మీ
రునుమనజానకమ్మయునెఱుంగఁగఁజెప్పితినున్నదున్నటుల్

ఉ॥ ఈదొరసానిమందుగుణమీయక యున్నదటంచునాపయిన్
వాదుఘటింపకుండఁ గలనై ఖరి తెల్పితి; నిందుమీఁదమీ
రేదిసమంజసంబనుచు నెంతగొయట్టులెసేయుఁడయ్య! యీ
మీఁదవిధాతయెట్లునియమించెనొయట్టులెయౌనిజంబుగా.

మ॥ తమమేనల్లునకుం గుమారికను నుద్వాహమ్ముగావింప ని
ష్టములేకుండిన యంతమాత్రమునసష్టంబేమి? యెల్లైననీ
యమబాధల్ యమబాధలౌటనిసుమంత్రైనన్విచారించిపెం
తముచాలింపుఁడు!రామచంద్రునికిఁగంటంబెట్టుఁడిబ్బాలకున్.

మ॥ కలరోగంబుతొలంగినన్ బిదప సంకల్పించుకొన్నట్లెమీ
రలొనర్పందగుఁగానిప్రస్తుతము నీరాద్ధాంతసిద్ధాంతముల్
సలుపన్వచ్చునె? తొల్త ప్రాణములు నిల్వంబెట్టుఁడెట్లైననీ
య్యలి నీలాలకప్రాణదాత తమమేనల్లుఁడె ముమ్మాటికిన్

శా॥ పోస్టాఫీసున పోస్టుసేయుఁడొకజాబున్ దేవు; నామాటలన్
టెస్టుంజేయఁగవచ్చు; "స్టార్టిమిడియేట్లీ" యుంచువైరిచ్చుచే
బెస్టన్నింటను;వైరుచూచుకొనుచున్ వేవేగమేల్ సైరిన
లోనే స్టార్టౌనత; డారణాలెకద మీకేమైన వేస్టైనచో.

ఆ. వె. ఆరణాలఖర్చటన్నంత మాత్రాన
గుండెరాయిపడి యతండు నోట

వలననాగ్లైదు నిముసముల్ వఱకు నాగృ
హంబు సర్వంబు నిశ్శబ్దమయ్యెనంత.

ఉ. ఆయవివేకియైన శరభాఖ్యుఁడు తుళ్లిపడంగ, నేమిత
ల్లీయని జానకమ్మ సుతనేడ్చుటమానికవుంగిలింప, నా
హాయని వైద్యురాలుఁగడు నక్కజపాటునుజెందఁ, రామచం
ద్రా"యనుగద్గదధ్వనివినంబడె ముప్పురకొక్కమారుగాఁ.

సీ॥ అమ్మ! ముద్దులగుమ్మ! యనుఁగుసీతమ్మ! నా
బంగారవుంబొమ్మ ! బలుకవమ్మ!
బావనేటికి నీవు పలువరించితివమ్మ!
స్వప్నమందతఁడు కన్పడెనటమ్మ!
కబురంపినానమ్మ! గడియకో క్షణముకో
వచ్చునాతఁడు నీవువగవకమ్మ!
నీకువానికిఁ బెండ్లినిశ్చయించితిమమ్మ!
మనసుదిట్టముచేసి కోనఁగదమ్మ!
జ్వరముతగ్గించుకొనుమమ్మ ! జడియకమ్మ!
బ్రతికిసఁగదమ్మ! యింతకుఁ బరిణయమ్మ!
టంచు నాజానకమ్మ సీతమ్మపైని
వాలికన్నీటి ధారలు గ్రాలవగచె.

గీ. వగచుటయుసీత కన్ను రెప్పలుగదిల్చి,
ప్రక్కకును నొత్తిగిలి, తల్లివదనమందు

సదమలశీల జానకమ సత్వరముం దనమేనువాల్చె; నా
ముదుసలిలోభియుఀ నిదురఁబోవఁగ జప్పున లేచియంతటఀ
చ. తనగదితల్పులుఀ బెరటితల్పులు చావడితల్పుఀ గనుం
గొని, గడియల్ బిగించి, చిరుగుల్ గలచాపయుఁజింకిగోనెయుఀ
మునుపటియట్లమర్చుకొని, మూల్గుచు దగ్గుచు, మెల్లమెల్లఁగ
గొణుగుచు మేనువాల్చెఁగదిగుప్పమునుప్పను బొక్కసమ్ముపై
గీ. అల్పసంతోషులకు నిర్మలాత్ములకును,
మఱియుఁ "గష్టీఫలీ" యను మానవులకును
వరలు నిద్రామహాసౌఖ్యమైన భవంబు
లోభులకుఁ గల్గునే యెందులోకమందు ?
శా. ఆకాళ్లాడిన బొక్కిబల్లపయిఁ దానాచాపపై గోనెపై
నేకాంతంబుగ మేనువాల్చి తనలోనేమేమొ చింతించుచున్
మూకల్ మూగెడుదొంగలందరుముకొంచుఀ నిద్రయన్మాటయే
లేకీరీతిగనమ్మహాత్ముఁడు వితర్కింపంగఁజొచ్చెఀ మదిఀ.
గీ. అరణాలంట ! వైరంట ! ఘోర మెంత
జమువులేకన్న దాదొరసానిగుంట ?
దానియబ్బగడించిన ధనముదాచి
యుంచినట్టులె మాటాడుచున్నదిచట.
క. డబ్బున్నర కవరంపిన
నబ్బాలున కందవొక్కొ ? యందినరాఁడో ?

డబ్బున్నవారి సన్నిపు
నిబ్బందులు పెట్టుచుందు గిట్టిమూర్ఖుల్.

౧. మేనల్లున కింతకు నొక
కానీకాద్దనఁ బాలుఁగవరేటికి ? నే
మైనన్ వ్రాసిన శీఘ్రము
వానిని గమ్మనుటకన్న వ్రాయఁగఁగలదే?

॥ అట్టు కాదట్లుకాదు; మేనల్లుఁగూర్చి
కలకాలంగల్ల నేకింగింపవలయుఁగాదె?
లేనియెడ వచ్చునో రాఁడో మేనయల్లుఁ
డతఁడు రాకున్న సీతకు బ్రతుకుగలదె?

॥ అందుచేఁ గవరువ్రాయుట యన్నిగతుల
నుత్తమంబని తోఁచుచు నున్నదిపుడు;
ఐనఁ జిన్నక్షరములతోఁ గానికొద్ది
సందుఁ బట్టింపలేన యొంతైనఁగాని॥

॥ సన్నని పాళీతోడను
చిన్నక్షరములను వ్రాసి చేర్చఁగలను నే
నెన్నైనను సంగతులను;
సన్నముగా వ్రాయుఁగా నచ్చాలును నాకున్॥

॥ మొన్ననుకలక్టరుకచేరి నున్నక్లర్కు-
నడిగి యొకపాళి దెచ్చితి; నగ్గిపెట్టె

నుంచి నాగదిగూటిలో నుంచినట్లు
జ్ఞప్తియున్నది; యదియందుఁగలదో? లేదో?

గీ॥ వెదకెదనుగాకయంచు వేవేగ లేచి
బుద్ధిదీపము వెలిఁగించి భూసురుండు
తనదుగదిలోఁ బ్రవేసించి తడుముకొనుచు
గూటిలోఁ జేయిపెట్టె యన్నాటిరాత్రి॥

గీ॥ ఇటునటుఁ దడుముచుండంగ నింతలోన
నతనిపాపోద్రేకవశమున నందులోనఁ
జేరి మొదలంటఁగాఁ గుడిచేతి నడిమి
వ్రేలును జిటిక్కుమని యొక్క తేలు పొడిచె.

శా॥ ఆలింబిడ్డ నతండులోభియయి యత్యాపత్సముద్రమ్మునన్
గూలంజేసిన కూళయంచుశితలాంగూలాగ్రశూలమ్మునన్
వ్రేలిందేలటుగుట్టె దుర్భర విషోద్వేలానలజ్వాలలన్
గీలల్ రేగి దహింపఁగాఁదొడఁగెదత్కీలాలనాళంబులన్ ॥

క॥ "అమ్మో"యని "అబ్బో"యని
"యయ్యయ్యో"! యనుచు రాత్రియంతయు నాతం
డయ్యెడ యమబాధన్ బడ
నయ్యార్తి యడంగ నుదయమయ్యెను నంతన్॥

గీ॥ ఉదయమగుటయుఁ దద్బాధయును నొకింత
తగ్గుటయులేచి కాలకృత్యములు దీర్చి

## ౩

### పండుగ కట్నము

అత్తవారిడు కట్నమందవచ్చు నటంచుఁ
గ్రొత్తయల్లుఁడు చంక గ్రుద్దుకొనఁగ
వచ్చియు రానట్టి వయసువచ్చిన బాల
తనకాంతు నరయంగఁ ద్వరపడంగ
ఉల్లమ్ము బెగ్గిల్ల నల్లురాకదలంచి
లోభిమామకు గుండె లొటుకు మనఁగ
అప్పడాల్ వడియాలుఁ బప్పులాదిగఁ గూర్చు
పనులలో నత్తలు మునిఁగి తేల
"వచ్చె వచ్చెను సంక్రాంతి వచ్చె"ననుచుఁ
"పండుగ ప్రయత్నములు చేసికొండ"టంచు
నెల్లకడలను జాటుచు నేగుదెంచె
మాసరాజంబయిన పుష్యమాసమంత॥

సీ॥ ముంగిళ్ళ ముగ్గులు రంగారు తోరణాల్
పసుపురాసిన ద్వారబంధములును
సున్నంపు గోడలు నున్నని చీడీలు
మొత్తినయరుగులుఁ గ్రొత్తసగలు
పంచల చాపులుఁ బరికిణీజ్జాకట్లు
జలతారు చీరల సంభ్రమములు

త్తరమునొసంగి పోవఁగ నతండును వైకవరూడఁదీసి యా
తురతసులోచనమ్ములనుదోట్కొనిరమ్మనజానకమ్మయుఁ.

గీ. వడివడిగ నేగి కొనివచ్చెవానికొసఁగఁ
గనుల ధరియించి తోడనే మనసునందు
శరభరాజు త్తరంబును జదువదొడఁగె
భార్యకొకమాటయును వినంబడనికరణి.

గీ॥ చదువుచుండంగ నప్పుడా శరభరాజు
గారి ముఖలక్షణమ్ముల తీరుగాంచి
కష్టవిచారకరంపుసంగతి యదేదొ
దానఁ గలదంచు నూహించె జానకమ్మ.

గీ॥ అందుకనుగుణముగ జాబునరసియతఁడు
నేలఁబడవైచి నిట్టూర్పునిగుడఁ జేసి
కన్నులను నీరుగార్చి మొగమ్మువాల్చి
మౌనమున్నుదాల్చె నోట నేమాటలేక.

గీ॥ దానభీతిల్లి పాపమా జానకమ్మ
వడకు జనియింప గద్గదస్వరముదోప
,,అయ్యయో! చెప్పరేమి? మాటాడరేమి?
ఎవరికేయుపద్రవమది యేమి జరిగె?

మ॥ మనమేల్లుఁదురాశ చంద్రినకుక్షేమంబేకదా ? పుట్టినిం
టనునాతల్లియుఁదండ్రిసౌఖ్యముగనున్నారేకదా?"యంచువె

స్నానమాత్రంబున నారవాటిననుగన గోపించి చీకాకుతో
ననెనా బ్రాహ్మణుడు ‹‹డేల వ్రేలెదవె జెప్పా! నీవుకష్టాత్మవై."

॥ నీకొంప మునుఁగలేదే !
నీకోరికలెల్లఁ దీరెనే గయ్యాళీ !
నాకొంపయె మునిఁగినదే
నాకొంపను నీసినాఁడు నాయల్లుండే".

॥ ‹‹అల్లుండనెదవదేమో ! మే
నల్లుండగు రామచంద్రుఁడా ?" యన ‹‹సీ ! సీ !
పాల్గోడఁ దన్నెదను మే
నల్లుండైయున మేల్మైను యుండుఁగదా ?

॥ పదిగరిసెల రాబడియును
పదిగాకరము నగదునున్న యట్టి మహాభాగ్యం
జెదనే నల్లునిగాఁ గోరఁ
గఁదలంచిన కామరాజు గళ్ళిఁయుంచినవాడా !"

క॥ అనుటయుఁ బక్కున నగియె
వ్వనజానన పల్కె ‹‹నేమివచ్చెనో ?, యాంహా !
మనకామరాజు తాతా
చనిపోయెను ? వరకట్నము తుయిగోగడదా ?"

గీ॥ మీకు నల్లుఁడుగాకుండ మేనుబాసెఁ
గాని, పాపము ! మీకూతు కంతమందుఁ

బుస్తె ముడిపై చిదే చనిపోయునేని
నింతదుఃఖంబు లేకుండునేమొ విూకు !"

గీ॥ అనుటయు శరభరాజు మహాగ్రిహాముస
మొగముచిట్లించుకొనుచు సమ్మగుచ కనియెఁ
"పరమ నిర్భాగ్యురాలవు; నట్టి పశువ
వెందుకుఁ బనికిరానట్టి మందమతివి.

శా॥ నోరెత్తక మృదువై నమాటయునసీనోటన్ వినన్ రాదు,న
న్గారుల్ పేరిలెదఁ వేను గడ్డిపరకై సన్ నీకుఁగాకుంటి; నే
క్రూరుండిట్లుకుమారికన్ విధవగాఁగోరన్? సిసీ!యింతతో
నోరున్ మూయుము ! పేలఁబోకుమిటు ముందున్ వెన్క
యోచింపకే.

క॥ తాతా ? పాపముచనెనని
నాతోఁ బరిహాసమటిదె ? నాయెపటుసకు
నీకై తక్కులు ? చాలును !
లే ! తొలఁగుము ! పొమ్మ ! సిగ్గులేని సిఖండీ !

శా॥ కానున్గట్నము బాధలేని కమయు క్షంబై ససంబంధమం
చానందెందితి వ్యర్థమయ్యెనుగదా? యన్నింట మేలై సదిం
కేసంబంధమునాకుఁ గానఁబడ దిస్సీ ! యింతనిర్భాగ్యురా
లే. సీతమ్మ? వివాహయోగమిఁక లేదేమో కదాదానికిన్ ?.

శా॥ పట్టుంబట్టితివీవు నీతకల నిర్భాగ్యంబు మేనల్లునిన్
గట్టన్ ;నీవనుకొన్న యల్లియవునేగాఁబోలు? కాదెన్నఁడున్

గనఁదగినవాని నొకని నాకస్మికముగఁ
గరవుదీరంగఁగాంచి రిర్వురునుగూడ॥

సీ॥ పదలలావణ్యాంబు ప్రవహించుకాల్వనాఁ
బ్రక్క పాపటతేటు పరిఢవిల్ల
చలువఁజేసిన ట్విల్లుమడ్పుపైని గులాబి
పట్టునెక్టయి కాంతులుట్టిపడఁగ
నూళైనబ్లాక్స్లిక్కోటు నీటులతోడ
కాళ్ళింగునునురంగు కయ్యమాడ
పాలమీఁగడవన్నె గాళ్ళిలుమేలిసరాయి
ముస్తాబును మరింత ముద్దుసేయ
జోడువాఁడాతనికి లేడు లేడటంచు
జోడు మేజోడుఁగూడఁ బల్కాడుచుండ
శాపవశమున మానవరూపపుగన్న
మారుగతినున్న యానుకుమారుఁగని ॥

క॥ సతియును బతియును నత్యా
ద్భుతగతిఁగని యొక్కమారు తుళ్లిపడంగా
సతఁడును వారలచెంతకు
నతిరయమునవచ్చి ''కుశలమా సీత'' యనన్ ॥

శా॥ ఆనందమ్మునజానకమ్మయెదురై యానోయి! నాతండ్రి!నీ
పై నేపాళిణములుంచి యింతవఱకున్ భద్రమ్ముగానున్న నీ

మెఱిఁగి చప్పనాతని కరముఁబట్టి
పక్కకునులాగి యిట్లని పలుకఁదొడఁగె.

చ॥ "సరిసరి! రైలుఖర్చుల ప్రసంగమయిప్పుడుముఖ్యమైన!
వ్వరొసఁగి, రెంతఖర్చనుచుఁ బ్రాణముతీయుచునున్న వారు;
వ్వరిడినన్నెట్లువచ్చినను వచ్చును! గాసునుబంపరైతి రీ
తరుగనిప్రశ్నలేటికి వృథాశ్రమమీయను వీనికింగదా?"

గీ॥ పావకాశమ్ముగా నాపరిసంగమితని
నడుగవచ్చును పావమెప్పుడు భుజించి
నాఁడో? యాఁకలితోడనున్నాఁడో? సీత
కంటఁ బడనిండు మొదట నన్నింటికన్న॥

గీ॥ అని వచించుచు రామచంద్రుని గుమాస్తె
కడకుఁ గొనిపోయెనప్పుడా పడతిమిన్న;
లోభియును లేచి తనగదిలోని కరిగి
మంచమునఁజేరి యేమొ యోజించుచుండె.

గీ॥ ఏమొయననేల? ఆనాఁడు రామచంద్రుఁ
డెటులవచ్చెనో? రైల్ఖర్చు లెవరొసఁగిరో?
భార్యయేమైన వానికిఁ బంపెనేమొ?
యనెడు సంశయమందున మునిఁగెనతఁడు.

గీ॥ ఔషధముదాగి పథ్యమ్ము నప్పుడెగొని
చిన్నమాగన్ను వెట్టి వచ్చియునురాని

నిజముగనందు సీతవలెనే కృశియించెను సీతఁజూడ, బా
ష్పజలధిగట్టె, ధైర్యసగసంతతిచే మనరామచంద్రుఁడున్.

గీ॥ రామచంద్రుఁడు, సీత, పరస్పరావ
లోకనంబునఁబడి యదే లోకమట్లు
లోకము మరచియుండ, నాలోన జాన
కమ్మ యత్యాదరమున సీతమ్మ సరసి॥

చ॥ ‘‘చనువుగ బావతో ననుప్రసంగమొనర్చెడుదానవమ్మ! యే
మనియునుబల్కరింపవిపుడయ్యయొ! యీతనియాశలింక, లే
వనుకొని నిశ్చయించుకొనియా? మరికాఁగలభర్తతోడనే
మనెదటంచు సిగ్గుపడియా? తనయా! పలుకాడవేటికే?.

చ॥ మొదటిదెకారణంబయిన ముద్దులగుమ్మ! యభాగ్యమేనుదె
ల్పెదవిను! నాదుకంఠమున లేశముఁ బ్రాణమునుండుదాక, నీ
ముదుసలి దండ్రిపట్టుదుదమట్టదు; కష్టములెన్నియైనఁబొం
దెద,నొకయించుకైన వెనుదీయక కార్యమునిర్వహించెదన్

మ॥ సకలోపాయములన్ బ్రయత్నపడి నీసంకల్పమీడేర్తు,నీ
కొకలోపంబునుగల్గనీయనుజుమీ! యొక్కింతధైర్యంబుతో
నిఁకనీవ్యాధి తొలంగఁజేసికొని యొల్లేనిన్ సుఖింపంగదే?
యకటా!బల్మినిజంపుకొందునటెబిడ్డా! నిన్ను నాచేతులన్?.

మ॥ ఇటుతాఁబట్టినయట్టి కుందేటికి మూడేకాళులన్నట్టు లె
ప్పటికింబట్టినపట్టు మానకనినున్ బాధించినన్, దండ్రిచెం

గటనిన్నుంచక నెంటఁబెట్టుకొని శీఘ్రంబేను బుట్టింటికిం
తటితో నేగి, విశేషమంతయును మీ తాతయ్యతోఁ జెప్పెదన్.
। చెప్పినవాలకించు, నినుఁ జంతకుఁ బిల్చెను, ముద్దులాడు, నీ
వ్వనువుప్పు, సఖ్యమును గూర్చు, సరేయని రామచంద్రుఁడా
నవ్వు దెపిల్వఁబంచును, రహస్యముగా నిఁక నీదు తండ్రికేన్
జెప్పక యేవివాహమును జేయును, జూతము మీఁదిసంగతుల్ !.
॥అని, మేనల్లునిగాంచి, ‘‘యోగ్యసుకుమారా! నీనిమిత్తంబుగా
నియింకేమియు చెప్పఁబోవునది ‘‘కానా! యొక్కమారిట్లు ర’’
మ్మని, తన్నుం బతి పిల్చినట్లగుటచే, నా సాధ్వి తాలేచిపో
వనుసందుండక, మేనయల్లుచెవిలో నేమేమొ పల్కెనుచున్.
। పిదపనందొంటిగానున్న ప్రియులొసర్చు
కొనినసంభాషణాక్రమమ్మును, బరస్ప
రానురాగక్రమమును సుందరయవచ్చుఁ
దొలుత జూనకమ్మనుగూర్చి తెలియవలయు.
॥ పిలుపువినినంతనే యామె యులికిపడుచు
భర్తగదిలోనికేగి నిల్వఁబడె నెదుట !
నులకమంచంబుపై నెల్లకిలఁబరుండి,
యేమొ తలపోయుచుండె లోభీశ్వరుండు.
॥ కొన్ని నిముసమ్ములగు వరకును నొకింత
పక్కకుఁ దిరిగిచూడక యొక్కమారు

పెద్దనిట్టూర్పువిడిచి, లోభిప్రభుండు
జానకమ్మనుజూచి, తత్క్షణమ లేచి.

గీ॥ ఔనె ! నిన్నొక్కసంగతి యడుగవలసె;
నున్నదున్నట్టులే చెప్పకున్న యెడల,
వీపుచేల్చెద నెముకలు విరుగఁదన్ని
కొంపలోనుండి నినుసాగ నంపువాఁడ.

ఉ॥ మాయగదోచుచున్నది సుమారుగటెక్కటుఘార్జి రెండురూ
పాయిలనాల్గణాలుగద? పైనగుఖర్చుల కెల్లనొక్కరూ
పాయియునైనలేకెటులవచ్చును? మొత్తముగాఁగమూడురూ
పాయిలనాల్గణాలెవరు పంపిరొవానికి నీవె చెప్పుమా ! ॥

శా॥ నీవేషాలును నీదుసంగతులు గన్పెట్టఁ రహస్యంబుగా
నీవ్వైమెనను బంపియుందువని సందేహింపఁగావచ్చు; నా
కావృత్తాంతముచెప్పి, చేసినది తప్పించొప్పుకొమ్మింక, నీ
కీవేళఁ విధియేవ్రాసెనొ కదే? యిస్సీ! మహాపాతకీ ! ॥

క॥ నానమ్మివేసినావా ?
నానుసఁగల కానునమ్మినావా ! యేదీ !
నేనొక్కమారు చూచెద
నీనానును దీసియిమ్మ ! నిజముగ్రహింతుఁ.

క॥ నీకృత్రిమ మేదైనను
గాకుండిన యెడలఁ జిల్లిగవ్వయునైనఁ

లేకున్న వాఁడునచ్చుట
యేకరణిని సంభవించునే గయ్యాళీ! ॥

మ॥ అనియమ్మంచము డిగ్గికట్టెదుట నుగ్రాకారుఁడై నిల్చి సం
తనెదొక్కించుక వెన్కకుంజరిగి కాంతారత్న మప్పట్టునన్
నన కేమార్గముఁగానరాక పతిచెంతం దప్పునంగీకరిం
చినఁబోఁదన్నుక్షమించునేమొయనిలోఁజింతించిభీతాత్మయై॥

గీ- కాసుగ్గనినాను గళమునుండి
వెలుపలికిఁదీసి, పతికిఁజూపించి, గద్గ
దస్వరంబున నపుడు కాంతాలలామ
గడగడవడంకుచున్ బల్కెఁ గడఁగనిట్లు.

మ॥ "ఇదిగో చెప్పెద నాస్తవమ్ము, విని, నన్నేలీల దండింతురో
యది కానిండు! తెగించిసిద్ధపడినా, నన్నింటనిర్భాగ్యనే
కద? యీకాసునునన్నపూర్ణకడఁ దాకట్టుంచి, యీనాటనే
పదిరూపాయిలు రామచంద్రునకునేఁబంపించిరప్పించితిన్॥

గీ॥ అనుచుఁగన్నీరు గార్చుచు నన్నుమిన్న
చేతులనుమోడ్చి కనుమూసి శిరమువంచి
మౌనమునుదాల్చియుండ నమ్మానవాధ
మాధముఁడు జాలి నొక్కింతయైన లేక ॥

శా॥ గొడ్డుంగోసెడువానికన్నను గడుంగ్రూరాత్ముఁడై నాఁడు చే
దుడ్డుంగైకొని దయ్యమూనినటుగంతుల్ వేయుచున్ లేశమే
యడ్డున్ లేకయె చచ్చునో బ్రతుకునోయన్ శంకయున్ లేక తా
గొడ్డుంబాదిన యట్లు బాదెనహాహా! కోపించిసాధ్వీమణిన్॥

పండుగ కట్నము

పురుషునకునైన స్త్రీకైనఁ దరుణముగాఁగఁ
గష్టదినములనన్నియుఁ గష్టములగును
శుభదినమ్ములనన్నియు శుభములెయగు;
సృష్టివైచిత్ర్యమియ్యది స్పష్టపరుచు ॥

గీ॥ తనదుగృహాచారమున నింతదనుకఁ బడయ
రానియిడుములఁబడి పొందరానివ్యాధి
నడఁగి కృశియించెసీతమ్మ; యాదినమ్ము
లరిగె శుభదినములు మొదలయ్యెనిపుడు ॥

గీ॥ మంచునంగప్పఁబడి ముకుళించి యుదయ
భానుకిరణ ప్రసారమ్మువలన మిగులఁ
భాసిలినపద్మము విధానవాసిగాంచి
గతమనోవ్యాధియై సీతక్రమముగాఁగ ॥

గీ॥ పతికతనఁదన యెడలెల్ల జతుక లేవఁ
జాలనని మంచమెక్కను జానకమ్మ;
రామచంద్రుండు సీతసంరక్షణమును
వంట శరభరాజును జేయవలసివచ్చె॥

సీ॥ మంచిమాటల నాదరించుచున్ దన్నులా
లించుచున్ మందుఁద్రావించునపుడు

నామీఁదనొట్టంచు నానంతు కడియొక్క-
టంచుఁ బథ్యంబు తిన్పించునపుడు
మనమేమి మాటలాడుకొనిన నియ్యదెవేళ
యంచుఁ దానిద్ర తప్పించునపుడు
ననుఁజూచి సేవ వెంతటి గౌరవమటంచు
నటిపించుటకు యత్నపడెడునపుడు
తనపయిందన ప్రియునకుఁదనరునట్టి
ప్రేమగుర్తించి తానును బ్రేమనించి
తెలిసి తెలియని వలపులఁదళుకు లొలుకు
సీతయానంద మేమంచుఁ జెప్పవచ్చు! ॥
॥ తలనొప్పియనిసీత పలుకంగఁ గపురంపు
గంధంపుఁ బూతమొగానఁబూయు
అరుచిపోవదునోటికిన ద్రాక్షఫలములు
మాటిమాటికిఁ దెచ్చి నోటనునుచు
కలవికారంబెట్టు తొలఁగునోయని సంతఁ
దమలపాకులుచుట్టి నమలఁజేయు
మంచిగాలియె రోగికించుమించుగ నౌష
ధంబంచు నించుకత్తరువొసంగు
జ్వరము వచ్చినట్లున్నదని మరలననినఁ
ఫాణితలమును బ్రియురాలి మేనఁజేర్చు

భావిశుభసూచకంబులు బయలుపడగ
సీతసంరక్షణ మతండు సేయుచుండు॥

ఆ॥ వె॥ ఎట్టిబాధలేక యేమూలుగునులేక
ప్రియునికతనసీత ప్రియముసెందు
"జరుగుచున్న యెడల జ్వరమంత సౌఖ్యంబు
లే"దటన్నమాట వాదుగాదు ॥

ఉ॥ తీయనిద్రాక్షపండ్లు కొనితెమ్మనిసప్పుడుగాని, యౌషధం
భీయఁగవేళయంచు వచియించినయప్పుడుగాని, లేకయిం
కేయదియైనఁ దానడుగనెంచిన యప్పుడుగాని, రామచం
ద్రా!యనియైన, బావయనియైనను బిల్వదుసీత నేర్పునన్॥

ఉ॥ ఒక్కొకవేళనెందులకొ యూరకపక్కన నవ్వుచుండు, రిం
కొక్కకవేళదుఃఖమున నొక్కటనశ్రులుగార్చుచుంద్రు,పై
నొక్కొకవేళగోప్యముగ నూరకయేమియొచెప్పుకొంద్రు; పెం
పెక్కనిలేవయున్నగల యీప్రియులిర్వురనేక భంగులన్.

ఉ॥"కన్నులనీరుపెట్టకుముకా గలకార్యముఁగూర్చి,యీశ్వరుం
డన్నివిధంబులన్ సదయుఁడై మనపక్షమెయున్నవాఁడు,నీ
నాన్నయునమ్మయున్ తమమనంబుల నెంతటి పేదవానిగా
నన్ననుకొంద్రో నేనులలనా ! వినుమంతటిపేదఁగానుజూ."

మ॥ తనప్రాణంబును బంపునట్లు బడిజీతంబెంతో కష్టంబుతోఁ
బనుచున్ నీజనకుండునాకు; నికనాపై ఖర్చులో నాదుభో

జననా! బట్టలా! యెట్లుకాలమును బుచ్చంగల్గుచున్నానో, నీ
జనకుఁడుఁగ్ర మఱినీవు; నీజననియుఁ గొంకింతు రేయెన్నఁడేన్.
మ॥ అతికష్టంబున నింతకాలమును విద్యాభ్యాసముం జేసితిన్
గతియించెన్ననుమాదినంబులు; నుమాకాంతుండు నాయందు దా
నతికారుణ్యముఁ జూపి నేటికొక యేడయ్యెం జుమీ! యస్మదు
న్నతవిద్యాభ్యసనప్రయత్నఫలమొందంగల్గుచున్నానిటుల్.
ఉ॥ వారిజనేత్రి! నాకుసహపాఠియనంగలఁ డొక్కఁడా జమీం
దారుకుమారరత్నము కతమ్మున నిత్యము నేనునున్ జమీం
దారుకుమారునట్టులె ముదమ్ము వహింతును, వాని మైత్రిబం
గారపుఁ గొండచందమునఁ గల్గెను నాకు నిజమ్ము చెల్పితిన్.
వ॥ వినుము! విశాఖపట్టణపు వీధుల జోడుగుర్రాల బగ్గిపై
ననుదనపక్కఁ జేర్చుకొని నా ప్రియమిత్రుఁడు పోవువేళ, నే
మునుపడినట్టి కష్టములు ముద్దకు లేకయె పస్తులుండుటల్
మనసునఁ దట్టి రాఁగ "విధిమాయయహో!" యనుకొందునంగనా.
ఉ॥ కన్నియ! వాని మైత్రి యెటుకల్గెనో తెల్పెదఁ జూడు; వానికిన్
టెన్నిసు ప్రాణమౌ; నిరుడు టెన్నిసుమేచను నందు టీములె
న్నెన్నియొ వచ్చె; నన్నిటిని నేనె జయించి, మదీయకందుకా
భ్యున్నత కేళికాపటిమ నొందితిఁ దక్కలధౌతపాత్రమున్.
మ॥ అది యేకారణమాదిగన్ మొదలత్యంతమ్ము స్నేహమ్ముగూ
ర్చె, దయంజూపి, మదీయదీనదశకుం జింతించి, యేలోపముం

డదు నీకీపయినంచు ధైర్యమునుబొందంజేసి, నాకెన్ని యో
సదుపాయమ్ములుసేయుచుండెనతఁడో చంద్రాననా! వింటివే ?

గీ॥ తాను మెట్రిక్యులేషనుతోనె చదువు
విడుచునట ? యింకననుఁ గష్టపడి పరీక్ష
ప్యాసుగమ్మనుచుండె; నా వరుసచూడ
నాతఁడుద్యోగమిప్పించు నంచునెంతు.

గీ॥ అయినఁ బట్టపరీక్ష ప్యాసయినవరకు
మానవలెననిలేదు నామానసమున
నింతకును నెంతపాత్రమో యెవ్వఁడెఱుఁగు"
ననుచు భాషించు సీతతో నప్పుడపుడు.

గీ॥ వేడుకలు పరిహాసముల్ వింతలు గుస
గుసలు కథలును నవ్వులు నెసఁగమెసఁగ
నాయవస్థ బాల్యక్రీడయట్లె వార
లిరువురు గడుపుచుండిరిదే విధాన.

సీ॥ మందొంటఁబట్టెను మాంద్యంబు తగ్గెను
నన్నంబుపైఁ గొంతయాశకలిగె
తలనొప్పియునుబోయెఁ దరిగెనాయాసమ్ము
జ్వరములేమిని నీరసమ్మడంగె
లేచి కూర్చుండఁగల్గెను నించుకించుక
యడుగులు తడబడ నడువఁదొడగెఁ

అవయవంబులయందు జనసత్వములుగూడె
స్వేచ్ఛగాఁదిరుగాడు చేవదనరె
చిన్నపనులను మెల్లఁగాఁ జేయుచుండె
నాటపాటలు చదువులు నన్నియును య
థావిధి జరుపఁబూనె సీతాలతాంగి
తల్లిదండ్రులుఁ బ్రియుఁడును నుల్లసిల్ల.

॥ అల్లనఁ జిక్కువిప్పి తలయంటి జలమ్ములువోసి, సీతకుఁ
దెల్లనిబట్టలిచ్చి నునుతేటొనఁగూర్చుచు జానకమ్మ తా
నల్లనియచ్చుబెల్లమున నాలుగువుంజిల పొంగుబూరెలఁ
వల్లభునాజ్ఞగైకొని యుపారముఁబెట్టను నమ్మవారికిఁ.

గా॥ రంగారంగ మొగానఁబూర్వపుఁగళల్ రాణింప, నాబాలకు
ష్ఠాంగంబుల్ మరలఁ యథావిధిమనోజ్ఞాకారముంబూన, నెం
దుంగోరంత కొరంతలేక వెలిగెఁ దొల్లింటి సింగారపుం
బంగారంపు నిగారపుం జిగితనూవల్లిఁ విరాజిల్లఁగఁ.

. కష్టంబులెల్ల సీతా
కష్టములటు సీతకెంతొ కష్టతరములై
కష్టమ్ముపెట్టె; నిపుడా
కష్టమ్ములు విచ్చె; మంచికాలమువచ్చెఁ.

॥ కాలిం బను కూలంబయి
కాలియుఁ దనతండ్రి పట్టుకదలించెను న

క్కాలంబు మాత్రమింకను
రాలేదీగడియవఱకు రాజాననరో.

క॥ పూర్వంపు బుద్ధిమానక
పూర్వఁపు దనపట్టుదలను బోవిడువకయే
పూర్వఁపు రీతినె మొదలిడెఁ
బూర్వఁపు యత్నముల కయ్యపూర్వుఁడు మరలన్.

ఉ॥ బంధులకుత్తరాలనిపె బాలికకెచ్చటనైన మంచి సం
బంధము గల్గెనేని జతపర్పుఁడటంచును; మేనయల్లుసం
బంధపుటాశలేకమును బాయక, మానక జానకమ్మతా
నుందగుసాధనంబునుగనుంగొనయత్న మొసర్చెనప్పుడున్

గీ॥ పండుగకు నేమయిన నీయవలసివచ్చె
ననుచు రామచంద్రుని సాగనంపనెంచి
,,చదువుపోవును మరల వచ్చెదవుగానఁ
జను" మనుచుఁబల్కె మెల్లంగా శరభరాజు॥

గీ! సీతతోఁ బ్రసంగంబు సేయుచున్న
యత్తకడకేగి మామపొమ్మనినవార్త
దీనవదనుఁడై యాతండు తెలిపెనపుడు
తల్లియునుగూతురునుగూడఁదల్లడిల్ల॥

ఉ॥ పండుగకట్నమీవలసి వచ్చెనటంచును నెంచి,'నిన్ను నిఁ
దుండఁగనీకపొమ్మనుచునుండిరి మామయగారు? కానిఁ

వుండు! భయంబులో నెటులనో సవరించెదనేనె; యింతకున్
బంధుగకట్నమిచ్చు భగవంతుఁడె నీకు విచారమేటికిన్ ॥

గీ॥ అనిపలికి జూసకమ్మ మేనల్లుతోడ
సీతతోడనట్టులె చాలసేపువరకు
భావిసంగతులనుగూర్చి పలువిధములఁ
దలఁచుచుండంగ నాటి మధ్యాహ్నమందు॥

క॥ అరగంటైన్ మొచటికో చని
పరుగుననుదెంచి తోటుప్రిపడుచును నింటం
జొరఁబడి చావడి తలుపులు
శరభాఖ్యుఁడు మూసె నేమిజరిగెనో తనకున్ ॥

గీ! తలుపులనుమూసి నిట్టూర్పు లొలుకుచుండ
భార్యకడకేగుదెంచి యా బ్రాహ్మణుండు
పలికెనీలీల గద్గదస్వరముతోడ
రామచంద్రుఁడుఁ సీత విభ్రమముజెంద ॥

శా॥ నేనెంతైన నదృష్టవంతుఁడఁగదా ! నిక్కంబుగానేను నా
ప్రాణాలిట్లరచేతనుంచుకొనుచుఁ బర్వెత్తుచుఁ వచ్చితిఁ
నేనీనాడిలుబాసినట్టిక్షణమింతీ! యెట్టిదోకాని యో
హో!నాపైఁబడనున్న గండమదియెట్లో తప్పిపోయెంజుమీ!॥

మ॥ మనయమ్మాయికియుక్తమైనయొకసంబంధంబుచేకూరెనం
చును మాటాడఁగమీరురావలయునంచుఁ బేరినుబ్బన్నని

న్న నెనాకుంగబురంపె నావిషయమున్మాటాడనూహించి యా
పనిపైఁ బోవుచునుండ మార్గమున నాప్రారబ్ధకర్మంబునన్॥

ఉ॥ ఏమనియందు నూర్గురకునెక్కుడుశిష్యులతోడ శంకర
స్వాములవారు నాకెదురువచ్చుచుఁ గన్పడినారు తోడనే
స్వామికిభిక్షయీయవలెఁ జచ్చితిరా భగవంతుఁడా యటం
చీమెయి వానికంటఁబడకే పరుగెత్తుచు వచ్చితిజుమ్మీ! ॥

ఉ॥ కంటనొకింతయుంబడక గ్రక్కునవచ్చితిఁగాని లేనిచో
వెంటనె భిక్షకై కొఱికివేయఁడెప్రాణములైదుఁగూడ నా
కంటికి భూతమట్లతఁడు కన్పడుచుండెను నింకమీఁద నే
నింటనెయుందు లేడనుమి, యెవ్వరుతల్పులుగుద్దిపిల్చినన్॥

క॥ వీఁడిల్లుకాల ! "ఎంతకుఁ
బోడట ! తనపాదకట్నమును జెల్లింపన్
బీడించుక తింటాడట !
లేడనుమీ ! శరభరాజు లేడనుమింటన్॥

గీ। నూరుగురితోడఁగొంపలునూర్చునంట
వేలువందలుపాదకట్నాలునంట!
బీదసాదులననుమాటలేదెయంట!
భిక్షయిడకున్న నాంక్షలు పెట్టునంట ! ॥

ఉ॥ కొట్టితినంచునాపయినిగోపముమానుము! మానకున్నచోఁ
గొట్టుమునీవుఁగూడనను గోపముచెందను; నంతెకాని, నా

ఘట్టనుజై టం బెట్టకుము కొంపకసర్గముపచ్చు నిన్నికన్
గొట్టనుగొట్టనెన్నంటను గోపముజెందను దిట్టనింతయున్॥

క॥ తలుపులుదీయకుమీ !గడి
యలుకయు జాగ్రత్తసుమ్మి ?యనియాతురతన్
బలుకుచు నాతండు గదిలో
పలికింజని మంచమందుబండుకొనంగన్॥

క॥ కలకలమనికిలకిలమని
పలు తెఱంగుల శరభరాజు పలికినపలుకుల్
తలపోయుచుం గనుపులు చె
క్కలుగా నాముపురు సవ్వంగడగిరిమిగులన్.

గీ॥ నాడుమొదలుగ మరి మూడునాళ్ళవరకు
శరభరాజాగ్రహించునన్ వెరపుచేత
వీధితలుపులు తెరువక విసుగుకొనుచుం
గాలమును వారుముప్పరుంగడపిరంత॥

గీ॥ శరభరాజును నల్లిమంచానంజేరి
కాలమునుభీతచిత్తుండై గడపుచుండె;
అతండు తనభోజనము వేళలందుందప్ప
గదివిడిచిపైకిరాండొక్కగడియయైన॥

ఉ॥ ఏమయినన్ రవంతధ్వనియెచ్చటనైనను నాలకించుచున్
జీమచిటుక్కు మన్నందనచెంతకు భిక్షుగోర నచ్చునా

స్వాముల వారిశిష్యులని చెప్పనఁద్రుళ్ళిపడంగఁజొచ్చెఁదా;
నీమెయి మూఁడునాళ్ళరుగ నింతటనాలవనాటిప్రొద్దునన్

గీ॥ శరభరాజు గుమ్మముకడఁజతికిలఁబడి
ప్రేళ్ళనేమేమొ లెక్కలు వేసికొనుచు
నొంటిరిగనుండఁగాఁబెరటింటినుండి
గుండెలను రెండుచేతులఁగొట్టుకొనుచు॥

మ॥ కనులందశ్రులుగార, గద్గదికతోఁగంఠస్వరంబొప్ప, నా
వనజాతేక్షణ జానకమ్మయటకుం బర్వెత్తుచున్ వచ్చి, యి
ట్లను"నయ్యో!మనకొంపముణ్గెనిఁక నేమందున్ గులంబందునన్
మనకయ్యెన్ వెలి,నీళ్ళుపుట్టవిఁక సామాన్యంబుగానెచ్చటన్

శా॥ ఏమే? యేమది? యేమియయ్యెఁ ద్వరగా నేమో యెఱిం
గింపు మం
చామాటల్ వినిలుబ్ధుఁడాతురతతోనామెన్ సమీపింపఁగా
"ఏమేమంచునుమీరునన్నడుగరాదేమయ్యెనో యయ్యె;నిం
కేమైనన్ మనసీత గొంతుకను మీరేకోసినారింతకున్॥

శా॥ "అయ్యయ్యో! మనసీతగొంతుకను నేనాకోసినానిప్పుడే
మయ్యెన్ జెప్పక యేడుపెందులకె జెప్మా" యంచుఁజీకాకుతో
నయ్యబ్జాక్షికనంగనామెయను "మీయత్నంబుసిద్ధించెఁగా
నయ్యెన్ ఖర్చిఁకఁగాదు; సీతకువివాహంబెట్టులౌనీపయిన్॥

ఉ॥ సందియమేల? చిన్నది రజస్వలయైనది; దానిజాతకం
బందు వివాహయోగము రవంతయులేదు; సరేకదా కులం

బందుసనాటి బంధువులయందున నీ తలవంపు మీకు నా
కుం దుదకిట్లు వచ్చె; మనకుంగతియేమిఁక నేమిసేయుదుర్॥

॥ చిన్నది యీడుదప్పె నిఁకఁ జేయకతప్పదు పెండ్లియంచు నే
నెన్నివిధాలఁ జెప్పుకొని యేడ్చితిఁ; జెట్టునుబుస్సుమంచు నే
నన్నది లేశముం దలపవైతిగదా? యిపుడేమిదారి? యే
మున్నదిసాధనంబు? గతులున్నవెమీకునునాకునకటా!॥

॥ పెద్దలు మీకునాకు వెలిపెట్టిననోర్చెదగో? కుమార్తె తాఁ
బెద్దదియైనమాట వెలిపెట్టక యల్లుని జేరఁదీసి యి
య్యిద్దరికిన్ రహస్యముగ నెచ్చుటనేన్ ముడివైతురో?అయో
ముద్దులబిడ్డ నేనడిసముద్రములోఁ బడవైతురో కదా?॥

॥ అమ్మలక్కల బుగ్గపోట్లందఁజాలఁ
బుట్టినింటికి నాకర్మమునను బోదు
కటకటా! సీతతోడనే గంగలోన
నురికెదనొ మీరలట్టులేయురుకుఁడింక ॥

మ॥ అనికన్నీరొలుకంగ దివ్యమనియయ్యబ్జాక్షి వంటింటివై
పునకుం బోవుచునుండఁలుబ్ధుఁడు కరంబుల్ సాచిఁ యానే!
[యొనే!
మనకర్మంబిది యిట్టులున్నయది; యేమార్గంబుచేనైననిం
దనుదప్పించుకొనంగఁజూడవలెఁగర్తవ్యం బెఱింగింపుమా!

ఉ॥ గ్రామమువారిపైఁ బడి, బకాసురుకై వడిఁ జంపుచుండెనా
స్వాములవారు; కాల్గదపఁజాలను గావున రాత్రివేళ నే
డేమయినన్ రహస్యముగ నేగెద నుబ్బనతోడనంతయున్
సామముగా ప్రసంగమునుసల్పెదఁగార్యమునిశ్చయించెదన్ ॥

చ॥ నినుబ్రతిమాలుకొందునిఁకనీవొకయింతయునీరహస్యమున్
మనయిలుదాటనీకుము ప్రమాదవశం బెవరేమిసేతు రం
గన! వినుమాడుబిడ్డలను గల్గినవారిటువంటి కష్టముల్
గనెదరుచాటుచాటుననె కన్నెలను ముడివైతు రేకదా: ॥

గీ॥ నమ్మమిదిమూడునాలుగు నాళ్లలోనె
యేదయిననొక్క సంబంధమేనుగూర్చి
యేకరాత్రివివాహ మొందేనొనర్తు
లలన! రెండవకంటికిఁ దెలియకుండ ॥

గీ॥ అనుటయును జానకమ్మ మీరాడినంత
పలుకు సత్యంబెకాని నాప్రశ్న వినుఁడు!
ఏకరణిదాచఁగలవారొ యీరహస్య
మెవ్వరెఱుఁగనియట్లు మీరింకమీఁద॥

మ॥ తనకున్ సీతనొసంగలేదనుచుఁజిత్తంబందుఁగోపంబుపెం
పునమేనల్లుఁడురామచంద్రుఁడిఁక రేపోనేడొ తానేగి, య
ల్లననాస్వాములవారిఁగాంచి,యిదితెల్లంబౌనటుల్ చెప్పి, య్యా
ఘనుబెట్టింపఁడె?దానిఁదీర్చుకొనరొక్కంబెంతొఖర్చౌఁగదా!

సీ॥ స్వాములవారిభిక్షకు నెంతలేదన్న
నుండఁగావలెఁగదా రెండునూర్లు!
పాదకట్నంబంచుఁ బట్టిపీడింపంగ
సర్పింపవలెఁగదా నైదునూర్లు!
మనసీతచేవెలి మరలించుకొనుటకు,
నీయఁగావలెఁగదా యేడునూర్లు!
ఆమీఁదపై ఖర్చులందందులంచాలఁ
బోయఁగావలెఁగదా మూఁడునూర్లు!
మరియు స్వాములవారి సమక్షమందె
పెండ్లిసేయుటయే సంభవించెనేని
వందలేకావు, వేలును వదలిపోవు;
పై నిమీఁచిత్తమును సీతభాగ్యమింక॥
గీ॥ తప్పదిదిమీఁకు సీతనాతనికొసంగ
కున్నఁ; గావునరవ్వలేకుండఁ జల్ల
చల్లగాఁబిల్ల నామేనయల్లుఁగూర్చి
పెండ్లియయ్యె నటంచనిపించుకొనుఁడు?॥
గీ॥ పలుపలుకులేల? కడసారిపలుకువినుఁడు!
వీధిఁబడి వేనవేల్ ఖర్చుపెట్టువారొ?
సీతనారామచంద్రుని జేర్చువారొ?
యేదిసమ్మతమో నిశ్చయించుకొనుఁడు!॥

గీ॥ అనఁగవిని నిప్పుద్రొక్కినయట్టి కోఁతి
గతిని, నున్మాదమెత్తినకరణి, దయ్య
మూనినవిధాన లేశమున్ మేనిపై ని
జ్ఞానమదిలేక యూరకే గంతులిడుచు ॥

శా॥ ,,వేలే? వేలకువేలటే? నిజముగావెచ్చించి జీవించుటె
ట్లో? లేదేయిఁకనేయుపాయమును? వేలే? వేలె? వేలే యటం
చాలీలన్ మదిమాలిపల్కుచును లోభాగ్రేసరుండంతఁదా
నేలన్ వ్రాలెనుమూర్ఛచెందినగతిన్ నిట్టూర్పులంబుచ్చుచున్

ఉ॥ అంతటజానకమ్మ భయబందిపతిన్ బిగియారఁబట్ట, నా
వింతలఁబొంచియుండి కనిపెట్టుచుండిన రామచంద్రుఁడున్
జెంతకువచ్చె; నిర్వురును శీతలమైనజలమ్ము మోమునం
దెంతయుఁ జల్లఁ గొంతతడవేగినయంతనె లుబ్ధుఁడల్లనన్ ।

చ॥ కనులనువిచ్చి, కట్టెదుటఁగన్పడుచుండిన రామచంద్రునిన్
గనుఁగొని,దుఃఖబాష్పములు గార్చుచులేచి, తటాలుమం [చునా
తనిబిగియారఁగౌఁగిటనుదాల్చి, మొగానమొగమ్ముచేర్చి నె
మ్మనమునఁదెచ్చుకొన్నయభిమానముతో బ్రతిమాలునీగతిన్॥

సీ॥ నాతండ్రి ! రావోయి ! నాయన్నరావోయి !
నాకొంపదీయుట న్యాయమోయి !
నామాటవినుమోయి! నీమామనుగదోయి !
నాయందుదుర్బుద్ధి వాయుమోయి!

గుట్టల్ల చెరిచి నా పుట్టుముంపకుమోయి!
కోరి గడ్డము బట్టుకొందునోయి
నీకుజిక్కితినోయి! నీయిష్టమేనోయి
బ్రతికించి నన్నుఁ గాపాడుమోయి
నాదుబ్రతుకెల్ల నీయధీనమెకదోయి
నేనునీవాఁడనెకదోయి నిశ్చయముగ
ముద్దుసీతమ్మ వరహాలమూటనింక
నందుకొనుమోయి! యర్పించుకొందునోయి!॥

ఉ॥ మారువచింపుమోయి ! యనుమానముఁజెందకుమోయి !
కన్యనిం
కేరికొసంగనోయి ! పరమేశ్వరు నానవచింతునోయి ! నీ
కోరిననాడె సంప్లి రెయొసఁగూర్చెద నీవయిఁదప్పదోయి ! నేఁ,
గోరినయట్లునన్ ధనముఁగోల్పడనీయకుమోయి!యట్లుఁడా॥

చ॥ అనిపలుమారు వేడుకొనుయట్లునకుంబ్రియముల్ ఘటించిభా
ర్యనుగని ‹‹నీదుపంతమెనుమాకొనసాగెనునెట్ట కేలకున్
మనమునసీవుఁగూడననుమానముమానుము ! పెండ్లియత్నమిా
దినముననుండిచేయుము! గతించిన దానిఁదలంప నేటికిన్ ?

మ॥ మనసీతమ్మకు నీళ్ళుపోయువరకున్ మర్యాదగాపాడి గు
ట్టునుభద్రమ్ముగనుంచు మెవ్వరికి నేడున్ గేపునెల్లుండియున్
మనతల్పుల్ మరితీయఁబోకు మెటులైనన్ మూఁడునాళ్ళుంగతిం
చినచో నాపయిలగ్ననిశ్చయముసేఁజేయించెదన్ పెండ్లికై ।

గీ॥ మగువ! యెల్లుండి బోగిపండుగయె గాన
గనుమపండుగనాటి ప్రొద్దుననె కాని
యింటిలోనికిరాదుకదే కుమార్తె ?
కనుక! మనకదే పండుగదినము సుమ్మి
గీ॥ అనుశరభరాజుపల్కుల నాలకించి
యిన్నినాళ్ళ కభీష్టమీడేరెననుచు
నిర్భరానందభరితులై నెగడిరంత
జానకమ్మయు నారామచంద్రుఁ డపుడు ॥
చ॥ చదువరులెంచవచ్చును రజస్వలయైనదొ సీత లేక తా
వదలక జానకమ్మ తనపట్టినపట్టును దీర్పనెంచి యి
య్యదియొకయుక్తిపన్నినదొ యంచునుమాకునునట్టిసందియం
బెదజనియించె నింత కెవరేమి గ్రహింతురు స్త్రీల
మాయలన్ ॥
మ॥ అరిగెన్ మూఁడుదినాలు; నాలుగవనాఁ డభ్యంగనస్నానమున్
నెరపెన్ సీతకుజానకమ్మ; మరియున్నల్లునిన్ నూతనాం
బరునింజేయఁ బదేపదే తనపతిన్ బ్రార్థింపఁ బ్రార్థింపనా
శరభాఖ్యుండుచికాకుతోఁ గనుమస్నానంబుతోఁ గిన్కతో ॥
ఆ॥ వె॥ సీత బాలసారెచేసినప్పుడు తన
యత్తవారొసంగినట్టి చాపు
పురుగు కొఱుక మిగులఁ జిరుగులుపడఁ బెట్టె
తీసి తీయలేక తీసి యొసఁగ ॥

ఉ॥ "పండుగపూట సీతకొకబట్టయు నొక్కనగైన లేకిటుల్
మొండిగనుంతురా? యిదియు నుచ్చటయా?" యని జాన
కమ్మ, యా
మొండినిబట్టి పెక్కువిధముల్ బలవంతము పెట్టినంత నా
తం డెరువిచ్చె మేటిజలతారుననిండినచీరయున్ నగల్॥

సీ॥ తాకట్టుగాఁబెట్టితప్పించుకొనలేక
విడిచిన కాసులపేర్ల జతలు
కొదువఁబెట్టిధనంబుఁగొని గతించినయంతఁ
దనవశంబైనముత్యాలపేర్లు
తగవురానెటుఁగ నీనగలేమొనీవేమొ
యనిమిగిల్చిన చంద్రహారములును
ధనము లేమిని నమ్మకొనఁ జూకగాఁగొన్న
నానులుఁగంటెలొడ్డాణములును
నాగరా లుంగరాలాదిగాఁ గల్గి
పలువిధంబుల భూషణంబులును నాడు
పెట్టెతీసి యమ్మాయికిఁ బెట్టుమనుచు
భద్రముసుమా యటంచును భార్యకొసఁగె॥

గీ॥ భూమిలోఁ బాతిపెట్టిన భూషణములు
పెట్టెలన్ భద్రపరచిన పట్టుబట్ట
లాదినంబునఁ బెకలించె నతఁడు మిగుల
జానకమ్మయు సీత యాశ్చర్యమొంద॥

సీ॥ సీమంతమును దీర్చి చేమంతులనుగూర్చి
జాళువా బంగారుజడ సమర్చి
చెంగల్వలకు శృంగ భంగమ్మొనరించు
కందోయిఁ గాటుక పొందుపరచి
కలకలలాడు చక్కనిముద్దుమొగమునన్
గళ్యాణతిలక మందముగ దిద్ది
కంటెయున్ గాసులుంగరములుఁ గంకణాల్
నానాదిగాఁగలనగలఁదొడఁగి
నాటిపండుగదినము సందడినినెల్ల
సీతకైగుత్తగాఁ గొన్నగీతిఁదనదు
కాంతునెడముద్దుముచ్చటల్ కొఱంతలేక
చక్కఁగాఁదీర్చుకొనఁ బొచ్చె జానకమ్మ॥

ఉ॥ కోరికలూరునట్లు తనకాంతునలంకృతఁజేసి, మేటిజ
ల్తారుబుటాలడాలుకనుఁగాఁగ, లేతగులాబిరంగులన్
గేరెడుచీరయున్, బసుపునిగ్గుల నుగ్గులుచేసి మేల్జరీ
గీరలపట్టుకైకఁదొడఁగించెను దన్గనుతూహలంబునన్॥

గీ॥ అట్లలంకృతమైన సీతమ్మనాఁడు
పోతపోసినబంగారు బొమ్మవోలె
మరునిగజ్జెలగుజ్జమ్మకరణిఁజూడ
వేయికన్నులుఁ జాలనివిధము తోఁచె॥

శా॥ ఆసింగారమునాగొబయారమును నాయందమ్ముచందమ్మునా
హాసోద్యన్ముఖమై గనిగ్యమునుగన్నారంగ వీక్షించి, హా!
యీసౌందర్యము నాకుమారికకు నేఁడెట్లబ్బెనోయంచు నా
డాసీతంగనిక న్నతల్లియొకరంబాశ్చర్య మొందెన్ మదిన్॥

గీ॥ పెరటిలోస్నానమొనరించి తిరిగివచ్చు
రామచంద్రునిదృష్టులారాజ వదన
యందునంటాలునం బడినంత నతఁడు
నిలువునన్ నీరగుచు నట్లనిలచి పోయె॥

శా॥ ఆలోచించుచు నేత్రయుగ్మత్రిక్కుచు నాడాకస్మికావస్థ న
బ్బాలారత్నవినూత్న భాస్వదురులావణ్య ప్రభారాశిఁదా
నాలోకింపఁగఁగన్నుదోయిమిరుమిట్లై మేనుభ్రమాన్నై తుదిన్
బాలారత్నముసీతయాయనిమదిన్ భ్రాంతింగొనెందంద్రియున్॥

శా॥ చాలంగాలమునుండియాకృపణుడై శ్వర్యంబుభూగర్భమం
దాలిలన్ బడియుండి నేడిటుమనోజ్ఞాకారముంబూని యి
బ్బాలారత్నముగాఁగ వచ్చెనోయనన్ భాసిల్లెనాసీత; చెం
బోలం జూడఁగ సీత నిశ్చయముగాభూజాతయానేకదా ?

శా॥ సింగారించుట పూర్తియాటముననాసీమంతినీరత్న మా
రంగన్మంగళవిగ్రహాన్ గరవృతీగన్ గాంచి ముద్దాడి లో
నంగాతూహలముప్పతిల్లఁబతిచెంతన్నిల్చి మొక్కించు మొ
క్కంగనాత్యమణీమంద్రిపాదములకున్ గేల్మోడ్చి మోదమ్మునన్ !

సీ॥ జుమికీలఁ గలజాలు గమియించఁ గాఁజాలు
తాటంకముల తళ్ తళ్ళు లెసంగ
చొక్కంపు నిగనిగల్ ధిక్కరింప గళానఁ
గాప్రిలు హారాలు నుయ్యాలలూఁగ
చరణ మంజీర ఝంఝుణఝుణానాదాన కం
కణ ఘణాఘణఘణక్వణము లలగ
నాణెంపు పసిడి నొడ్డాణంపుఁ జిరుగజ్జె
లల్లసల్లన ఘల్లుఘల్లు రవఁగ
పదనరదనమ్ములకును జక్కఁదన మొసఁగి
చంద్రికలనవ్వు లేనవ్వు సందడింపఁ
వనకడకువచ్చి మ్రొక్కిన తనయనెత్తి
యక్కునంజేర్చి చక్కనముద్దాడెయుంటి॥

గీ॥ ‘‘శీఘ్రమేవ కల్యాణసంసిద్ధిరస్తు
వాంఛితాభీష్ట సత్ఫలప్రాప్తిరస్తు!
ఆయురారోగ్య విభవా స్తటంచు నాఁడు
కన్య నాశీర్వదించెను గన్నతండ్రి॥

ఉ॥ అంతటితోడఁబోక శరభాఖ్యుఁడు కూఁతు నిజాంకభాగమం
దెంతయుఁజేర్చి యాపయిని నెందుకొమ్ముల్లఁగ రామచంద్రునిన్
జెంతకుఁబిల్చి సీతకడఁ జేరిచి బాహువులుసాచి వారిన
త్యంతకుతూహలంబుననునక్కున మిక్కిలియాదరించుచున్

క॥ రాఁగలశుభసూచకములు
కాఁగల దంపతులు మీామొగమ్ములఁదోఁచెన్
సాగించెదఁ గార్యంబిఁక
వేగమెయున జానకమ్మ వినివిని పిదపన్ ॥

చ॥ వెలవెలబారిఁ నేఁడుకడువింతగనున్నవి వీనిచర్య లా
జలనిధులింకునేమొ? కులశైలములేఁడునుగూలునేమొ చు
క్కలుఁదెగిరాలునేమొకో జగంబునవెట్టియుపద్రవం బిఁకన్
గలుగునోయంచువింతగనుగాంతునిమోముఁనిగాంచియిట్లనున్

క॥ మీాయాశీర్వాదములకు
మీాయభిమానమ్ములకును మీాపలుకులకున్
వేయినమస్కారమ్ములు
సేయుచునొకమాటనేనుజెప్పెదవినుఁడీ॥

చ॥కడకొకచిల్లిగవ్వయునుఁగానలెనంచునునోరువిప్పి మి
మ్మడుగఁడు, మేనయల్లుఁడునునల్లుఁడుగాఁగలవాఁడు, నీనికి
వడువునఁజంకిచాపొతలి సందుగుకట్న మొసంగి నారహా!
కడుపునలేనిప్రేమయదికౌఁగిటనుండునెనాకుఁజెప్పఁడీ!॥

గీ॥ ఎందుకీ కౌఁగిలింతలింకేటికిట్టి
ముద్దులాడుట లనుచు నాముదితపలుక
లోనముసిముసి నవ్వుల మేనయల్లు
నరసి యీరీతిపల్కు నాశరభర్గాజు॥

శా॥ వేళాకోళములాడుచున్న దిననుఁ విన్నావటోయీ! యిటుల్
వేలుఁ వందలు నేనొసంగినను దృప్తింజెంద వీవందుచే
వేలుఁ వందలు మించుకట్నమును నర్పింపంగనున్నాఁడనీ
వేళఁ నీకటుగానదానిఁ గొనిసంప్రీతిన్ బ్రివర్తింపుమా!॥

ఉ॥ పండుగకట్నమంచు నొకపంచలచాపొకయుంగరంబున
ల్లుండగువాని కిచ్చెదరు లోకమునందున, నంతెకాని, యా
తండడిగినో రునో తెలిసిదాని ఘటింపఁగఁజేయరెవ్వ, రా
పండుగనాడు; కాననది పండుగకట్నమె నీవె చెప్పుమా!॥

ఉ॥ నిండు మనంబుదేనిపయినీకు జనించెనొ! వేలులక్షలుఁ
నిండినయట్లు దేనిఁగని నిత్యము సంతసమొందుచుందు వా
యండజయాన, నాబిసరుహాననః సీతను ముద్దుగుమ్మ నీ
పండుగనాఁడొసంగెదనుబండుగకట్నముగా గ్రహింపుమా!

మ॥ అనిసీతాకరపల్లవంబతని హస్తాబ్జంబునందుంచి నం
తనె పాణిగ్రహణంబొనర్చి యతఁడానందాశ్రువుల్ గారఁగా
కొనెనాపండుగకట్నమంతదనకోర్కుల్ మొల్కలెత్తంగఁదా
మును నెన్నండునులేనిసిగ్గున శిరమ్మున్ వంచెనాసీతయుఁ॥

చ॥ జరిపెనుపెండ్లి కొన్నిదివసంబులకాగృహమేధి; యేగతిఁ
జరిపెనొ, లగ్నమైనవు డొసంగినయట్లునికట్నమేమొ? యే
కరణినినెంతగాధనము ఖర్చొనరించెనొ, యావిశేషముల్
శరభయగారి నైజగుణసంగతిఁ బట్టి గ్రహింపఁగోరెదఁ॥

సంపూర్ణము.

# ఉపోద్ఘాతము

ఇయ్యది సాంఘికవిషయ పద్యకావ్యము. హాస్యరస ప్రధానము. హాస్యరసప్రధానములగు వచనకావ్యములు మన యాంధ్రభాషయం దచ్చటచ్చట నున్నవి కాని, యిట్టి పద్యకావ్యములు మాత్రము మృగ్యములని నాతలంపు. ఈగ్రంథమును బూర్తిచేసిన తరువాత నియ్యది యాంధ్ర మహాశయుల హృదయముల రంజింపఁజేయఁగలదా లేదా యనుసంశయము నాకుఁ గలిగెను. అందుచే నప్పుడప్పుడిందలి పద్యములను విద్యార్థులగు నామిత్రులయొద్దఁ జదువుచు వచ్చితిని. వారిలో ముఖ్యులు మ. రా. శ్రీ బురా శేష గిరిరావుపంతులు, ఎం. ఏ., గారును, అడిదము రామారావు పంతులుగారును. క్రమక్రమముగ నేతత్కావ్యప్రసంగ మీ ప్రాంతమందలి సంఘసభలయందు వ్యాపింపఁదొడంగెను. అందుమూలమున ననేకసభలయందు విద్వాంసులయెదుట నీకావ్యమును జదువు మహాభాగ్యము నాకుఁ బలుమారు లభించినది. నాయం దభిమానముండుటచేతనో, యీకావ్యమునం దించుకప్రాశస్త్యముండుటచేతనో విద్యార్థు లెల్లరు మత్కావ్యనిర్మాణచాతుర్యమును గొనియాడి త్వరలోఁ బ్రకటింపుమని నన్నుఁ బ్రోత్సాహపరచిరి.

కాలవైపరీత్యముచేత నే నీగ్రంథమును బ్రకటించుట కశక్తుఁడనై యుంటిని. అది గ్రహించి నామిత్రులగు మ. రా. శ్రీ

చేవూరు సుబ్బారావుపంతులు బి. ఏ.గారు నాకభయమొసంగి నన్నుఁగూర్చియు, నా కావ్యమును గూర్చియుఁ దమ జనకు లగు మ.రా.శ్రీ చేవూరుసన్యాసిరాజు పంతులుగారితో విన్న వించిరి. సన్యాసిరాజు పంతులుగారు కవితాభిమానులు. ఉదా రశీలురు. భాగవతోత్తములు. వారు తోడ్పడకుండినచో నీ గ్రంథ మింకనుగొంతకాల మనామకస్థము పడియుండవలసినదే ఆయనకే యీగ్రంథమును గృతిసమర్పింపవలయునని తొలుత నిశ్చయించుకొంటిని. కాని సన్యాసిరాజు పంతులుగారు "భాస్కరశివరామకృష్ణ" అను మకుటముతో సర్వస్వరూపుండగు సర్వేశ్వరునియందే తదంకిత భారముంచవలయునని నాకాజ్ఞాపించుటచే, నాయభిమతము కొనసాగలేదు.

ఏతత్కావ్యప్రకటనమున పంతులుగారు నాకొనరించిన మహోపకారమునకు, సర్వేశ్వరుఁడు వారిని వారికుటుంబమును నిరంతరాయుశ్శై శ్వర్యాభి వృద్ధితో రక్షించుచుండుఁగావుత మని కోరుచు, మత్కృతజ్ఞతాసూచక పద్యము లీక్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

మ॥ అతిసామాన్యులకందరాని సుకవీంద్రాశీర్వచోలబ్ధశా
శ్వతభాస్వద్విభవాయురున్నత యశస్సంపద్విశేషమ్ములన్
సుతసద్బంధుహితాశ్రితప్రతతితో శోభిల్లుముద్యన్మతిన్
సతతంబీవు ధరామరాన్వయమణీ! సన్యాసిరాజాగ్రణీ! ॥

మ॥ ధనికుండై కవితాప్రపంచమును నుద్యత్కీర్తి నాజ్ఞించువాఁ డనఘానూటనొకండు; మద్వ్యయముదుష్టాలాపమునన్ దుష్ప్రభో

ధనముంగోల్పు ధనస్థుచోటఁ బరమార్థజ్ఞానముంగల్గు స
జ్జనులీలోకమునందు మృగ్యులుసుమీ సన్యాసిరాజాగ్రణీ!

మ॥ కవితాశక్తియడంగలేదు, కవివాక్యంబెందు వ్యర్థంబుగా
దవనిన్ దొల్లిటి సత్కవీశ్వరుల శాపానుగ్రహప్రజ్ఞ లో
టుపడన్ లేే, దిఁక నాదరించు తమబోటుల్ మేటిదాతల్ గుణ
స్తవనీయుల్ కరవౌటచింత్యముసుమీ సన్యాసిరాజాగ్రణీ !

సీ॥ శంఖచక్రగదాది సాధనంబులతోడఁ
బుట్టనే తొల్లింటి భోజరాజు
ఘనచతుర్బాహుసంకలితుండై పొడమెనే
రాణ్మహేంద్రపురీవరప్రభుండు
కనకకుండలయుతాంగములతో వెలసెనే
యానాటి కృష్ణరాయాధిపుండు
అగ్నికుండంబునం దవతారమొందెనే
సర్వజ్ఞసింగమక్ష్మావరుండు
వారల నిరంతర యశశ్శరీరములకుఁ
గవితయెడఁ గవులయెడలఁ గలిగినట్టి
గౌరవాదరణమ్ములే కారణములు
ఆశ్రితామరభూజ ! సన్యాసిరాజ !

సీ॥ జనకసన్నిభుండు నీజనకుండు నినుగన్న
తల్లిమేటిపతివ్రతామతల్లి
నీమందిరంబిందిరామందిరసమంబు
సుగుణాలప్రోవు మీ సుబ్బరావు

నీకరం బార్త రత్నాకరంబు త్వదీయ
వర్తనంబు బుధప్రకీర్తనంబు
నీహితంబఖిలాంధ్రసాహిత్యహితంబు
ధర్మాంచితంబు తద్వాంఛితంబు
నీదుజాతంబు పూతంబు నీదుపేరు
నాధునికకవుల చరిత్రమందుఁ జేరు
వినుతకవితాభినవభోజ ! విమలతేజ !
ఆశ్రితామరభూజ ! సన్న్యాశిరాజ !

విజయనగరము
23—10—1919

ఇట్లు
భాషాసేవకుడు
కృతికర్త

*

#  చ న ము లు

——:o:——

| | | | | | |
|---|---|---|---|---|---|
| ...తిచంద్రిక (చక్కనిపటములతో) | | చి॥ సూ॥ | 0 | 8 | 0 |
| ...ంచతం...త్రము | ,, | | 0 | 8 | 0 |
| భారతసుధ | ,, | దో॥ సీ॥ | 0 | 8 | 0 |
| కాళిదాసునాటకకథలు,, | | చ॥ వూ॥ | 0 | 12 | 0 |
| జైమినీభారతవీరులు | | మ॥ ల॥ | 0 | 12 | 0 |
| అరవింద | 1 భాగము | వి॥ ల॥ | 0 | 12 | 0 |
| అరవింద | 2 భాగము | ,, | 0 | 12 | 0 |
| ఘోషరాత్రి | | ,, | 0 | 10 | 0 |
| | | చ॥ వూ॥ | 1 | 0 | 0 |
| | | చి॥ ల॥ | 0 | 12 | 0 |
| ...ద్రవిజయము | | | 1 | 0 | 0 |
| ...త్రము | 1 భాగము | | 0 | 8 | 0 |
| | 2 భాగము | | 0 | 11 | 0 |
| | | | 0 | 10 | 0 |
| ...ణపి (పద్యము) | | | 0 | 10 | 0 |
| ...ాపః...ు | | | 0 | 5 | 0 |

| | | | | |
|---|---|---|---|---|
| సప్తమస్కంధము | టీ॥ తా॥ | క్యాలికో | 1 | 8 |
| రుక్మిణీకళ్యాణము | ,, | క్యా॥ | 0 | 10 |
| ,, | ,, | ప్లైన్ | 0 | 8 |
| గజేంద్రమోక్షము | ,, | క్యా॥ | 0 | 10 |
| ,, | ,, | ప్లైన్ | 0 | 8 |
| భాస్కరశతకము | ,, | | 0 | 4 |
| దాశరథీశతకము | ,, | | 0 | 4 |
| కుచేలోపాఖ్యానము | ,, | పోతన్న | 0 | 4 |
| అంబరీషోపాఖ్యానము | ,, | ,, | 0 | 4 |
| నలోపాఖ్యానము | ,, | ,, | 0 | 8 |
| సుమతీశతకము | ,, | | 0 | 3 |
| కుమారీశతనము | ,, | | 0 | 3 |
| కృష్ణశతకము | ,, | | 0 | 3 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము ధూర్జటికవి, తాత్పర్యము | | | 0 | 3 |
| టీకా బాలరామాయణము | | | 0 | |
| నృసింహశతకం (మూలం) | | | 0 | |
| సప్తమస్కంధము (మూలం) | | | 0 | |
| ,, | | లఘుటీక | 0 | |

కర్రా అచ్చయ్య అండ్ సన్సు బుక్ సెల్లర్సు, రాజమ

శ్రీసీతారామాంజనేయ ముద్రాక్షరశాల—రాజమం